# ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

**నాళం కృష్ణారావుగారివి**

| | రు. | అ. |
|---|---|---|
| కేసెచినుకులు | ౦ | ౮ |
| పాలతరగలు | ౦ | ౮ |
| గోగీతము | ౦ | ౨ |
| పైడిశేడి | ౦ | ౨ |
| ముద్దు | ౦ | ౪ |

**పూజాపుష్పమాలవారివి**

| | | |
|---|---|---|
| చాకిరేవు | ౦ | ౮ |
| బాష్పబిందువు | ౦ | ౮ |

**రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారివి**

| | | |
|---|---|---|
| వ్యాససంగ్రహం | ౨ | ౮ |
| గద్యచింతామణి | ౧ | ౮ |
| బాలకవిశరణ్యాము | ౧ | ౮ |
| వ్యాసావళి | ౧ | ౦ |
| ఆంధ్రకవిభిషక్కుల భాషాభేషజము | ౧ | ౦ |

**వ్యాసకుటీరం వారివి**

| | | |
|---|---|---|
| జన్మభూమి నాటిక | ౦ | ౪ |
| ప్రేమాంజలి–పంచమదంపతుల చరిత్రం | ౦ | ౫ |
| శుభోదయము | ౦ | ౩ |
| శ్రీ వివేకానంద సందేశము | ౦ | ౨ |
| సుగుణాకరము | ౦ | ౧౪ |
| తూలిక | ౦ | ౧౦ |
| ఆత్మజ్యోతి | ౦ | ౮ |
| సంధ్య | ౦ | ౬ |

**ఉన్నవ లక్ష్మీనారాయణగారివి**

| | | |
|---|---|---|
| నాయకురాలు | ౧ | ౦ |
| సంగీతనాపసాని | ౦ | ౧ |
| సోది | ౦ | ౧ |
| భావతరంగాలు | ౦ | ౧ |
| హరిజన నాటకము | ౦ | ౧ |

**వఝ్ఝల వేంకటేశ్వరకవిగారివి**

| | | |
|---|---|---|
| శాకాభంగము | ౦ | ౧౨ |

**మారేమండ రామారావుగారివి**

| | | |
|---|---|---|
| భారతీయ విద్యాచరిత్రము | ౦ | ౧౨ |
| శ్రీమధ్వాచార్యులవారి చరిత్ర | ౧ | ౦ |

**భావరాజు వేంకటకృష్ణారావుగారివి**

| | | |
|---|---|---|
| విదేశయాత్రికులు_ప్రాచీనాంధ్ర దేశము | ౧ | ౪ |

**కవితాసమితివారివి**

| | | |
|---|---|---|
| వైశాఖి—వారికసంచిక | ౧ | ౦ |
| ఉత్కళపతనము నాటకం | ౦ | ౧౨ |
| ప్రభవ—ఖండకావ్యాలు | ౦ | ౮ |
| మాతృపూజ పద్యఖండాలు | ౦ | ౪ |

**స్థానాపతి రుక్మిణమ్మగారివి**

| | | |
|---|---|---|
| పూలమాల—ఖండకావ్యాలు | ౦ | ౪ |

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| వ్యాసావళి | ౦ | ౪ |

**కూచి నరసింహంగారివి**

| | | |
|---|---|---|
| ఆత్మసంయమము_అమితవిషయాసక్తి | ౦ | ౬ |
| అనుబంధము | ౦ | ౩ |

**వేదుమళ్ల కామేశ్వర రావుగారివి**

| | | |
|---|---|---|
| కలువలు | ౦ | ౪ |
| పాతపాటలు | ౦ | ౨ |

**మునిమాణిక్యం నరసింహారావుగారివి**

| | | |
|---|---|---|
| కాంతం కథలు | ౧ | ౦ |
| నేనూ మాకాంతం | ౦ | ౪ |
| వక్రరేఖ | ౧ | ౦ |

**రెం. లక్ష్మీనరశింహశాస్త్రి గారివి**

| | | |
|---|---|---|
| హృదయవిహంగము | ౦ | ౪ |

**నడింపల్లి జగన్నాథరావుగారివి**

| | | |
|---|---|---|
| ఆంధ్రమహాసామ్రాజ్యము (సాదా) | ౧ | ౪ |
| క్యాలికో ఉత్తమప్రతి | ౨ | ౮ |
| Age of Mahabhrata | 1 | 0 |

**నడింపల్లి వేంకటహనుమంతరావుగారివి**

| | | |
|---|---|---|
| సాహసిక—నవల | ౧ | ౦ |

**గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివి**

| | | |
|---|---|---|
| ప్రచ్ఛన్న పాండవము (నాటకం) | ౦ | ౮ |
| వోటు | ౦ | ౧౦ |
| మూర్ఖరాజు | ౦ | ౪ |
| నీతిధర్మము | ౦ | ౪ |
| సంపూర్ణస్వరాజ్యము | ౦ | ౪ |
| శ్రీరామచరిత్ర | ౦ | ౮ |
| ప్రపంచచరిత్ర (గ్రీసు) | | |
| మొదటి భాగము | ౦ | ౮ |
| రెండవ భాగము | ౦ | ౮ |
| మూడవ భాగము | ౦ | ౮ |
| నాలుగవ భాగము | హాజరులేదు | |
| అయిదవ భాగము | ౦ | ౮ |
| ఆరవ భాగము | ౦ | ౮ |
| ఏడవ భాగము | ౦ | ౮ |
| Neglected Emperor poet | 0 | 8 |
| Spiritual Swadesi | 1 | 0 |
| Age of Vemana | 0 | 6 |

**పార్నంది రామశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| శ్రీ మహాభారత విమర్శ | ౦ | ౮ |

**రాయసం శేషగిరిరావుగారివి**

| | | |
|---|---|---|
| కొత్తనమూనా (నాటకం) | ౦ | ౧౨ |

**మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| చతుర్దశమనుచరిత్ర | ౦ | [illegible] |
| సుభాషితములు | ౦ | ౧ |

**కొ. స్వర్ణవల్లిగారివి**

| | | |
|---|---|---|
| వినోదశిల్పము | ౧ | ౪ |

## కలాభివర్ధనీపరిషత్తు—ఇన్నిస్‌పేట—రాజమండ్రి

---

# చరకసంహిత

చికిత్సాస్థానము మాచే ఇదివరకు ఆంధ్రీకరింపబడి యిపుడు ద్వితీయ ముద్రణమగుచున్నది. మిగిలిన ఆరు స్థానములను ఆంధ్రీకరించి, స్థానషట్కమనే పేరుతో ఒకే పుస్తకరూపమున ప్రచురించితిమి. గ్రంథములన్నియు కొలదిదినముల క్రిందటనే తయారైనవి. వెంటనే ఆర్డరిచ్చువారికి తగినసౌకర్యముగా లభింపగలవు. చరకసంహిత నంతను నేనే పూర్తిగా ఆంధ్రీకరింపదలచి మిగిలిన సూత్రస్థానమునుగూడ ఆంధ్రీకరించి కొద్దిరోజులలోనే ప్రచురింపబోవుచున్నాడను. గ్రంథము పూర్తికాకుండా ఆర్డరిచ్చువారికి తగుసౌకర్యములతో లభింపగలదని అందరికీ తెలిసిన విషయమే. మా యితరపుస్తకములును, మా 250 రకముల మందులును ఎల్లప్పుడును సిద్ధముగా నుండును.

డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. బెజవాడ.

# హాలీవుడ్డు నుండి కడపటి సందేశము

**డాక్టరు నాశే**

హాలీవుడ్డు. యు. యస్. ఏ.

14 వ నవంబరు 1934

అయ్యా!

మీ 'లోధ్ర' స్త్రీలకు నిశ్చయముగా దివ్యమైనదనియు, అత్యద్భుతమైనదనియు తెలుపుటకు సంతసముగుచున్నది. నా మందులపెట్టెయందు అనవరతము యీ మందు నుంచుకొనుట మరవను. స్త్రీజనమునకు అత్యంతాప్తమైనది.

భవద్విధేయుడు
(సం) నాశే.

కేసరీ కుటీరం
ఎగ్మూరు, మద్రాసు.

---

**Sparkling & refreshing beverage**

**Stimulating & invigorating Tonic**

*Always drink*

# VIMTO

**The best nature's fruit tonic drink that keeps you fit and cheerful throughout the Year.**

*Sole bottlers for Vizag. Dt:—*

## THE CRYSTAL AERATED WATERS,

**manufacturers of high-class mineral waters and Aerated water specialists,**

**VIZAGAPATAM**




సంపుటము ౬ రాజమహేంద్రవరము ౧౧ ఏప్రిల్ ౧౯౩౭ ౪ వ సంచిక

# తెనుగురక్తం చప్పబడిపోతూ వుంది

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"చిత్తంచిత్తం. వొక్క కలంపోటుతో తమ రౌత బ్రాహ్మణకుటుంబానికి యావజ్జీవమూ అన్నంపెట్టగలరు"

"అన్నం పెట్టినా సున్నం పెట్టినా జిల్లాబోర్డుప్రెసిడెంటుగారు. నావల్ల యేమవుతుందీ?"

"పేరుమట్టుకు వారిదే-అంటే మనవిచేసుకుంటాను. ఒక సత్రం వుండంటే దాన్నేర్పరిచిన దాత వేరూ, అక్కడ కనిపెట్టుకుని వుండి, సద్దుబాట్లు చేసే గుమాస్తా వేరూను. ఆదాత ఆజ్ఞని శిరసావహించడం గుమాస్తా పని కాదా మహానుభావా?"

"నేను దాతను కానే!"

"తమ రిలా సెలవిస్తే నే నేం మనవి చేసుకోగలనూ! సబ్ కలెక్టరుగారి శిఫారసు అంగీకరించకుండా జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఏచెరువు నీళ్లు తాగగలడూ!"

"అది పూర్వకాలపుమాట. అంటే అప్పు డేమున్నదీ ప్లీడరో ప్రెసిడెంటుగా వచ్చేవాడు. అధికార్లతో యెలా మసులుకోవాలో వారికి బాగా తెలిసేది. ఇప్పుడు వాళ్లు—చాలామంది మాట సుమండీ. పెద్దసంతకమా చిన్న సంతకమా అని డఫేదారు నడిగి—"

"తమరే వుపక్రమించారు కనక విన్నవించుకుంటాను. మన ప్రెసిడెంటుగారు—విద్వాంసులా? కేవలమూ—రాత్రీ పగలూ కూడా మోటకపిలా—"

"సాటిబ్రాహ్మణ్ణి పట్టుకుని అలా అంటా వేమిటయ్యా?"

"సాటివాడు కనకనే మాకీ తిప్పలు. ఏనాయుడుగారో, యేచౌదరిగారో అయితే—"

"బ్రాహ్మణ్యం స్త్రీ లాగా కనిపిస్తున్నావే!"

"ఇందులో యుక్తం వుంది మహాప్రభో!"

"అయితే సంగతంతా తెలిసే వుంది కదా, పోనీ, యేనాయకురాలినో పట్టుకోరాదూ!"

"తమవల్ల కాకపోతేగదా!"

"అయినా సులభంగా పని జరిగిపోయేటప్పుడు ఆలోచన యెందుకూ!"

"ఇంటెల్లపాదిమీ వొక నెల వస్తుందేనా యేదో సప్లయి—"

"జిల్లాబోర్డుప్రెసిడెంటు కయితే సప్లయిలు మహా బాగా చేస్తారు ప్రజలు"

"చిత్తంచిత్తం, నాది పొరపాటే. రేపీపాటికి—"

"ఏదో మాటవరసకి కంటే యిలా మొదలుపెట్టా వేమిటయ్యాయ్ ? ఈశాస్త్రశిఫానుభాగ్యానికి నేను లంచం పుచ్చుకుంటానుటయ్యా?"

"లంచమా? ఎన్ని వేల గుండెలున్నాయి ధర్మరాజు వంటి తమ సన్నిధిలో అలాంటి మాట అనడానికి నాకూ! అసలు తమకి లంచం ఇవ్వడానికి నాకు తాహతు యెక్కడుంది?......మాకింత అన్నం పెట్టినందుకు తమకి వున్నాను వాళ్ళ పనులు తమరు వాళ్ళ నేనా చూడరుగాని, అయినా యేపులుసులో కేనా పనికివస్తుందని వొక బుట్టెడు బెల్లం,—అన్నట్టు మరిచిపోయాను వొక పద్యం చేసుకుంటాను—"

"ఇవి, యిలాంటివి నాకు నచ్చవు చేస్తానంటావా యేమిటి? పట్టమైనవాడవే"

"తమ అనుగ్రహించడటని ధైర్యం—"

"మా అమ్మాయీ, అల్లుడూ పిల్లలూ వస్తున్నారు రెండురోజుల్లో. అసలు నేనే కొంటాను గానీ—"

"వద్దువద్దు. తెల్లవారేటప్పటికి నేను దాఖలుచేసుకుంటాను. నేనూ ఆడపిల్లలు గలవాణ్ణి. ఆడపిల్లలికి పుట్టింటిఆశ యెంత వుంటుందో, వాళ్లకి తల్లిదండ్రులు పెట్టుపోత లెలా చూడాలో నాకూ తెలుసు. ఇంతకీ స్వామి ఇక్కడ తమ ఇంత అన్నంపెట్టించాటప్పుడు నేను తమ అమ్మాయిగారికి కాస్త వుప్పూ, కాఫీ—"

"అవునవును. బెల్లంమాట కేం గాని—వెధవబెల్లం మాయింటో యీగలు కూడా దానిమీద వాలవు. నువ్వు కాఫీ అంటే జ్ఞాపకం వచ్చింది, నీదగ్గర యీ మధ్యనే యీనిన ఆవుందిట కాదూ?"

"వుంది మహారాజా, వుంది. జ్ఞాపకం వచ్చింది కాదు. స్వయంగా తోలుకువస్తాను నేను"

"గోదానం చేసుకున్నా ననుకుంటావా యేమిటి?"

"రామరామా! దానం పట్టేదాకా తమకేం?"

"బ్రాహ్మల కిస్తే యేపేరు పెట్టినా దానమే అవుతుంది; కాని మాకిచ్చింది—విన్నావూ? నజరు. ఇనాము. నజరానా అంటే అదే. సామాన్యులు దాన్నే నేమా నంటారు"

"చిత్రం, చిత్రం"

"అసలు మాకు ప్రతిగ్రహాధికారమే లేకుండా చేశారు కాదూ మీ బ్రాహ్మలూ?"

"అనకూడదు కానండి—పూర్వపువాళ్లు ముక్కుమూసుకూర్చోడం తప్ప మరేమీ యెరగరు"

"కనకనే అప్పుడు దేశం బాగుండేది.......అవును గానీ—తెల్లవారితే ద్వారపూజకి జవాన్ని పంపానుకుంటున్నాను, మానెయ్యమంటావా ఇదీ?"

"ఇంకెందుకు మహాప్రభూ?"

"మా అమ్మాయి యిక్కడ వున్నంతకాలమే—, కాదంటే వొంటిపూట పడిబాకానూ. తరవాత రోజు మాకక్కర లేదుసుమా"

"ఏదో శాస్త్రం చెప్పిన తరహాయిగా వొట్టిపోయాక గుదిబండలాగ—నేను వచ్చి తోలుకుపోతాను కాదూ అన్నదాతా"

"సరే అయితేనూ. నువ్వు మాకు ఆవుని తోలిపెడితే యీకారణంవల్ల కూడా అది గోదానంలో చేరదు సుమా"

"అసలు తమకి సందేహం—"

"సందేహాని కేమీ లేదు గానీ—అసలు సందేహం యేమిటి గానీ—యింకోటి కూడా వుంది చూశావో లేదో గానీ"

ఏమిటండి!"

"నిజంగా అది దానమే అనిపింకుంటే మళ్లీ నువ్వు తోలుకువెళ్లడం దత్తాపహారం అయిపోతుంది. నీకు ఆ పాపం చుట్టబెట్టుకోకుండా వుండడానికూడా దాన్ని దానంలో చేర్చడానికి వల్లకాదు. తెలిసిందా?"

"చిత్రంచిత్రం"

"సరే వెళ్లు.........రేపు పొద్దున్న కనబడతావు కాదూ?"

"కాకులు కూశాటప్పటికి వచ్చి లేపనూ తమర్ని?"

"అదీ తెలివి. వెలుగు వచ్చిందంటే దిక్కుమాలిన ప్రజలు—"

"ఒక పని చేస్తే?"

"ఏమిటది!"

"రాత్రి వన్నెం డయాటవ్వటికి—"

"బాగుంది. మేము సినీమాకి వెళ్లి వచ్చాటవ్వటికి తోలుకువస్తా వన్న మాట"

"చిత్రం"

"ప్రెసిడెంటుతో నేనీ సాయంత్రమే చెప్పి వుంచుతాను, తరవాత వుత్తరం పట్టుకువెళుదువుగాని"

"చిత్రం మహాప్రభూ!"

"మరి వెళ్లు"

౨

"మణుగునెయ్యే!"

"మరి తప్పదు"

"వొప్పుకుని కూడా వచ్చారా యేమిటీ!"

"లేకపోతే చావనా!"

"ఇంకేమీ లేవు కదా!"

"ఆ—వు—కూ—డా—"

"ఏమిటీ!"

"మన ఆవుని కూడా తోలిపెట్టాలి"

"కొంప ముంచారు"

"ఎలాగో సమాధానం చెప్పుకోవాలి. వుద్యోగం అంటే మాటలతో వుం దనుకున్నావా యేమిటి!"

"ఇంతకీ అది అబ్బాయికి అత్తవారిచ్చిందే కదా!"

"మీకేమైనా మంచీ చెడ్డా వుందా లేదా!"

"ఏం!"

"మనమరాలికి పాలకోసం కదా వియ్యాలవారు దాన్ని తోలిపెట్టారు!"

"దానితండ్రికి నౌకరీ రావడానికి మనం తోలిపెట్టాలి"

"నలుగురూ గడ్డిపెట్టరూ!

"ఆయన అన్నం పెట్టడం లేదూ!"

"....................."

"....................."

"కాకపోయినా నాకేం! అది కోడలిది కదా! దాని యిష్టమూ, అబ్బాయి మనసూ, ఆపైని మీ అవసరమూనూ. మీచిత్తం వచ్చినట్టు చేసుకోండి"

"అబ్బాయే తోలుకువెడతాడు, మనకేం!"

"చంటిపిల్ల నోటిదగ్గిర పాలు వడగొట్టి—పిల్లలున్నారా ఆకలకేడుకి!"

"రెండు రోజుల్లో కూతురూ, అల్లుడూ మనవలూ వస్తారుట, వాళ్లకి కాఫీ—"

"కూతుళ్ల తండ్రేనా! నోరెలా వచ్చిందో!"

"అధికారం—అధికారం—వాళ్లకి నాగం డేమిటి!"

"చంటిపిల్ల—మూడుమాసాలగుడ్డు—దాని వుసురు తగలదూ ఆయనకీ!"

"మాట్లాడవద్దు, గప్ చిప్! నిప్పున్న కర్ర సాగులడక మానదు. ఇక వూరుకో, పింఛను పుచ్చుకున్నాక వీళ్ల మొగం చూసేవా డెవ డింకా!"

"ఆనక ఆయన గతేమిటో కాని యిప్పుడు మన పిల్ల కడుపు మాడుతుంది. ఇక డబ్బాపాలు పొయ్యాలి"

"వొక్కనెల, వొక్కనెల వోపిక పట్టు. కోడలికి కూడా కష్టసుఖాలు బోధించు. ఆవూచీ అంతా అబ్బాయిదే కానీ—నెల తిరిగేటప్పటికి నలభై రూపాయలూ, గల్లున చేతిలో పడతాయి. మొదటినెల జీతం రాగానే మాంచి కామధేనువులాంటి ఆవుని కొనేస్తాను అదిపెట్టి. రెండోనెల జీతంపెట్టి వొక్క బనారను చీర—చూశావూ! అది వచ్చని మసిమి కనక వూదారంగుది—జరీ పువ్వులుది కొని కట్టబెట్టా మంటే మొగం యింతవుతుంది దానికి. మూడోనెల జీతంతో బుల్లెమ్మకి బాల తొడుగు. దానితో దాని కడుపు కొట్టిన దోషం పోతుంది. తరవాత సంసారం వూటుగా—"

"అఘోరించినట్టే వుంది మీ కల్పన. చాల్లెండి ఇక వూరుకోండి. ఇదో ప్రజ్ఞగా మొక్కడా చెప్పకో కండి నలుగురూ లాటాకులు కడతారు"

"వాళ్ళ మొహం. అబ్బాయికి వుద్యోగం అయిందంటే నేనిక యీవుండాకోరులతో మాట్లాడతానూ!

3

"......తమ రలా అంటే—"

"నేనన్న దేంవుందీ యిందులోనూ? అసలు సంగతి చెప్పాను. ఆపైని మీయిష్టం"

"అలా కాదు. తమరు కోప్పడితే నేను ఆగలేను. బ్రాహ్మణ్ణి. బీదవాణ్ణి. కుటుంబీకుణ్ణి. తమరు కాస్త అనుగ్రహించాలి"

"వాళ్ళింటికి రాగానే దర్శనం చెయ్యడానికి మీకేమీ అడ్డులేదు......ఏం?"

"తమరు నాకిక చివరనించి మాట్లాడితే—"

"మరి నువ్వు?"

"....................."

"వంగతోట దగ్గిర బావ కాదు కాబోలు"

"......కటాక్షించాలి"

"ఊ—హూ"

"అలా కాదు........."

"......లింగూలింగూ అయిదు రూపాయల కాగితం జేబులో పడేసి పర్వతం లాక్కుపోతా నంటా వేమిటయ్యా! నేమగాడవే"

"మహారాజులు కాదూ? ఇవి చేతులు కావు కాళ్ళు. దరిద్రాణి. తానకం తాకట్టు పెట్టి తెచ్చాననీ అయిదు రూపాయలూనూ. ఇక నన్ను కోసినా లేలేను. మమ్మల్ని రక్షించాలి"

"......అల్నాగే మీ బ్రాహ్మలకి చెల్లింది; కాని మాకు కాదు. దేవ—తెలిసిందా? ఉదయం తొమ్మిదిన్నరకి వస్తే వారు కాఫీపుచ్చుకునేటప్పుడు దర్శనం చేయిస్తాను. దానికి మాత్రం వొక రూపాయి తప్పదు సుమండీ"

"అదో కూడానా?"

"అంతా వాడితోటే వుంది"

"ఇక తల వొకన్నటే మిగిలింది. ఆరూపాయకోసం అది తాకట్టుపెడతాను. తప్పుతుంది మరి?"

"......కాని వున్న సంగతి చెబుతున్నాను నేను. మోసం చెయ్యడమూ దగాచెయ్యడమూ నావల్ల కాదు. ఇన్ని విధాల ప్రాధేయపడుతున్నారు కనక నామనస్సు వెన్నలాగ కరిగిపోతోంది...కరిగేపోయింది కూడానూ. మరి చెబుతాను వినండి"

"చెప్పండి"

"ప్రెసిడెంటుగారికి సబ్ కలెక్టరంటే యిష్టం లేదు"

"చచ్చాను......ఏం?"

"కారణం యేమయితే యేం? అది అలాగా. ఆవుత్తరం నాలిక గీసుకోడాని కేనా పనికిరాదు"

"కొంపగుల్ల—"

"అక్కడ యేమాత్రం?"

"రామరామా! బ్రాహ్మణపక్షపాతి అండీ కలక్టరుగారూ. ఆశ్రయించాను. అనుగ్రహించారు"

"సరే, ఏంజరిగిందో జరిగింది కుంభకోణం. నా కిందుకాన్నీ—చెప్పాను కాదూ? ఆవుత్తరానికీ తెల్లకాగితానికీ వొక్కటే విలువ"

"మరి గతేమిటి?"

"అనుమాన మైనా దారి వుంది. కావలిస్తే చెబుతాను"

"సెలవివ్వండి"

"ఆవుపాయం చేశారంటే మీరు వారి దర్శనమే చెయ్యనక్కరలేదు. తెల్లవారేటప్పటికి ఆర్డరు చేతిలో పడుతుంది"

"అనుగ్రహించమన్నాను కాదూ?"

"అప్పుడు మాత్రం నాకింతో కాగితం—తెలిసిందా? "ఊ" అంటే గాని నేనిక చెప్పను"

"ఎక్కడ తేనూ?"

"మణుగునెయ్యి, బుట్టెడు బెల్లం, డబ్బా తేనెపానకం—"

"......తమ రేమిటేమిటో సెలవిస్తున్నారు. నాతల విలువ తెలుసుకుని తమ రేమన్నా—"

"నీతల విలువ ఆవే చెబుతుంది"

"....................."

"వులిక్కిపడతావేం?"

"....................."

"మాట్లాడ వేమయ్యా?"

"అవుపాయం యేదో చెప్పండి"

"అలా దారిలోకి రా. తప్పకుండా యిస్తావు కాదూ? ......లేకపోతే మళ్లీ వెలుగు వచ్చాటప్పటికి అర్ధరు రద్దు"

"....................."

"బాగా జ్ఞాపకం వుంచుకో. మరి విను; మెరక వీధి...... ఛా—బ్రా......అణిముత్యం — పేరెప్పు డేనా విన్నావా?"

"లేదు. ఎవరండి ఆయన?"

"ఆయన కాదు ఆవిడా. వేశ్య"

".........సరే, సెలవివ్వండి"

"అది చాలా అందమైనది. మాంచి ముమ్మరంలో వుంది. చూస్తే విడిచిపెట్టడం కష్టం. అప్పుడే నలుగు రైదుగురు పకీరు లయిపోయారు—"

"వర్ణన అక్కర్లేదు. చెప్పండి"

"అది శిఫారసు చేస్తే పని జరుగుతుంది. మరి నీ తెలివి తేటలు వినియోగించుకో"

"వేదం చదువుకున్నవాణ్ణి—"

"నీకొడుక్కికూడా ఆవేదమే చెప్పుకుంటే యీతి ప్పలు లేకపోవును కాదూ?...... వేదాలూ, శాస్త్రాలూ మీకే వుండాలి. ఉద్యోగాలు కూడా మీరే కొట్టె య్యాలి. కదూ?"

"....................."

"....................."

"ఇక యీవుత్తరం—"

"ఆముదం అన్నమాట. ఒకటో నెంబరు అంబాజీ పేట సరుకు. పేగులు మహాబాగా శుద్ధి చేస్తుంది. చేసే సింది కూడానూ"

"వుండుమీద కారం చల్లుతున్నారు"

"చీము పట్టకుండా తొరగా మానిపోతుంది, నయమే కాదూ?"

2

"....................."

"వెళ్లవయ్యా వెర్రిబ్రాహ్మడా! తెల్లబోయి నుం చుంటే పన్లు అవుతాయిటయ్యా యీరోజుల్లోనూ?"

"ఆపని చెయ్యాక తప్పదంటారా?"

"తప్పకేం? నిర్బంధమా యేమిటి? మానెయ్యడమే నాసలహా. అదే మహా వుత్తమమైన పని. అయితే: దానికి ముందు......వుద్యోగవాంఛ వుండే, దానమ్మ కడుపు కాల, అది చేస్తూ వుంది యిదంతానూ. కసక మెలాగేనా అది కాస్తా వదిలించుకోగలిగితే రా యిక వేశ్యాదర్శనమూ అక్కర లేదు, చివరికి దేవతాదర్శనం కూడా అవసరం లేదు. నిశ్చింతగా కూచుని, జంధ్యాలు మెలివేసుకుంటూ వేదాలూ, శాస్త్రాలూ—మరి దయ చెయ్యండి"

"....................."

౪

"ఎవరు మీరు?"

"మేం బ్రాహ్మలం"

"దండాలు, ఏం పనిమీద దయచేశారూ?"

"శ్రీకృష్ణార్పణం,......పెద్దపనిమీదే వచ్చాను"

"మేళం కావాలా?"

"నాకంత తాహతూ లేదు, ప్రస్తుతం అవసరమూ లేదూ,.........బహుకుటుంబీకుణ్ణి. రెక్కలే ఆధారం, అన్నం పెడతా వని వచ్చాను"

"అలా కుర్చీలో దయచెయ్యండి......"

"....................."

"............ తమవంటివారిని సత్కరించడానికి తాహతు లేదు. పైగా యోగ్యత కూడా లేదు. అయినా "పత్రం, పుష్పం, ఫలం, తోయం—" శ్రీకృష్ణులవారు సెల విచ్చారు కారూ?.........ఆశీర్వదించండి"

"నాలుగు రూపాయలు చేతిలో పెట్టి శక్తి లేదనీ, యోగ్యత లేదనీ—"

"వొక్క సెలగ్రాస మేనా యివ్వలేకపోయాను, సిగ్గుగా వుంది"

"అమ్మా! విన్నాను నీయోగ్యత. విన్నదానికి నిదర్శనం కనపడుతోంది......కాని......నువ్వు వొక్క సంగతి కొంచెం ఆలోచించాలి. నేను నీదగ్గిరికి డబ్బు కోసం రాలేదు. కనక యివి నీదగ్గిర వుంచు"

"......మీదగ్గిరే వుంచండి, మరి నేను పుచ్చుకోను......ఇక నావల్ల తీరవలసిన ప్రయోజనం యేమిటో చెప్పండి"

"చెప్పమంటావా?"

"సందేహం యెందుకూ?"

"సందేహమే లేదూ, చాలా ఆశపడి వచ్చాను"

"కానివ్వండి చెయ్యతగిందీ, చెయ్యకలదీ అయితే నేను సంచున్నపాళంగా తయారూ"

"అనుగ్రహం వచ్చిందంటే నువ్వు మాకందరికీ అన్నంపెట్టగలవు. అంచేతే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను"

"ఊహూ"

"వేశ్యావాటికలో అడుగుపెట్టడానికిదే నాకు మొదలు. నరకం చచ్చినచ్చాను; కాని నీయోగ్యత చూడగా సిగ్గుపడవలసిన పని కనబడదు"

"మీ పని చెప్పండి ముందు"

"చేస్తానని నువ్వు ముందు వాగ్దానం చేస్తేగాని నేను చెప్పలేను"

"అలాంటి వాగ్దానం నే నెప్పుడూ చెయ్యను. వేశ్యలవల్ల నెరవేరే రాచకార్యా లేమీ వుండవు. వున్నా—చెప్పాను కాదూ? నాశక్తిని పట్టీ, ఆపనియొక్క మంచిని పట్టీ నా సాయం వుంటుంది"

"నాకు ఆరుగురు కూతుళ్లు, ఇద్దరు కాపరాలు చేసుకుంటున్నారు. ఇంకా ముగ్గురికి పెళ్ళిళ్లు చెయ్యాలి. ప్రస్తుతం మూడో పిల్లకి కార్యం చెయ్యాలి......ఇదిలా వుండగా, నాకొక్కడే కొడుకు. ఆకొడుకొక్కకూతురు. అది మూడుమాసాల గుడ్డు—"

"పొద్దున్నే చూస్తే పాపాలు పోగొట్టే కుటుంబం అండీ మాదీ"

"నీకలా తోచడం నాఅదృష్టమే......ఆకొడుకుని కష్టపడి మెటిక్కులేషన్ చదివించాను. యల్టీకూడా అయిపోయాడు. ఉద్యోగం—అంటే యిప్పుడు మేష్టరీ కోసం తిప్పలు పడుతున్నాను"

".........ఊహూ"

"అది నీశిఫారసువల్ల నెరవేరుతుం దని తెలిసింది......మా అమ్మవుకాదూ?......ఈపుణ్యం కట్టుకోవూ?"

"అది యిచ్చేవా రెవరూ?"

"జిల్లాబోర్డు—"

"ఆ!"

"ప్రెసిడెంటుగారు"

"......నేను శిఫారసు చేస్తే యిస్తా రని మీ కెవరు చెప్పారూ?"

"ఎప్పుడూ వారి దగ్గర వుండీ గుమాస్తాగారు చెప్పారు"

"శ్రీహరీ.........శ్రీహరీ!"

"ఏమమ్మా?"

".........ఆబుగ్గమీసాల యెలుగ్గొడ్డా మీకిలా చెప్పింది?"

"అవును, ఆబోసినోటివులే"

"......................"

"......................"

".........దేవు డున్నాడా శాస్త్రుల్లుగారూ?"

"అలా అంటా వేమమ్మా?"

"ఇంకే మనాలీ? దేవుడు లేడు, దెయ్యాలు మాత్రం వున్నాయి. ధర్మం లేదు, అధర్మం అంతటా నిండివుంది. మంచి మందులో కేనా లేదు. దౌర్జన్యం ప్రభ వెలిగిపోతోంది. నీతి మాలోనే కాదు, మన దేశంలోనే లేదు. ఎవ రేం చెప్పినా శుద్ధ అబద్ధం తప్ప సత్యం లేదు. ఎక్కడ చూసినా హింస—ఎక్కడ పట్టినా రక్తం—దేవుడు లేనేలేడండీ"

"దేవు డంటే నమ్మకం పోగొట్టే సంఘటన యేమి సంభవించింది తల్లీ నీకూ?"

"………కోప్పడవద్దు… నన్ను నిందించవద్దు. ………బ్రాహ్మల్లో ఛండాలు రున్నా రంటారా లేదా శాస్త్రుల్లుగారూ?"

"లే—ర—ని—చె—ప్ప—లే—ను"

"ఆఛండాలురికి మీరు చెప్పిన ప్రెసిడెంటు కులపెద్ద"

"…………………"

"ఏం, కష్టంగా వుందా మీకు?"

"లేదు, లేదు, కాని పాకీవాళ్ల స్వాధీనంలో కూడా కొన్ని పను లున్నాయి"

"నిజమే; కాని పాకీవాళ్ల నేమీ అనకండి మీరు. పాకీపని వాళ్లకి వృత్తి. వృత్తికీ, గుణాలకీ సంబంధం వుంటుందా?"

"వుండదు"

"పాకీవాడు పాకీపని చెయ్యాలి. లేకపోతే అంశ కంటె యెక్కువ తాహతు కనపరచాలి"

"అలాగే"

"అయితే, మరి బ్రాహ్మడు?"

"దైవికాంశ కనపరచ్చాలి"

"మీ ప్రెసిడెంటు దగ్గిర ఆదైవికాంశ లవలేశమూ, లేనేలేదు, సరే కదా, రాక్షసుల అంశ పూర్తిగా వుంది"

"కొన్ని అవగుణా లున్నాయని విన్నాను; కాని వర సుదుర్మార్గు డని తెలవదు. నీకేం అపకారం చేశాడు పల్లీ ఆయనా?"

"పశువు—కాదుకాదు, పశువే నయం అంతకంటేను………వొక బ్రాహ్మల యింట్లో పెళ్లికి నేను మేళం వెళ్లాను"

"ఊహూ"

"మొగపెళ్లివారికి మీ ప్రెసిడెంటు దగ్గిరి చుట్టం… పెళ్లికి వచ్చాడు………వొక రాత్రి బసకి రమ్మని నాకు కబురు……మీరు చెప్పిన బుగ్గమీసాల యెలుగ్గొడ్డే రాయబారి"

"తెలవక అడుగుతున్నాను. నీకూ ఆయనకీ యిది వరకి సంబంధం లేదూ?"

"కబుర్లు వచ్చాయి, అంగీకరించలేను. మాపింతల్లి కూతురికీ ఆయనకీ సంబంధం వుంది. దానికీ, నాకూ వున్న అనుబంధాన్ని పట్టి నేను వల్లకా దన్నాను. వొకమాట టీసంగతి దానితో చెప్పగా దానిమీద కొంచెం తర్జనభర్జన జరిగింది. ఈగొడవమీదే మరో నాలుగునెల్లకి వాళ్లకి చెడిపోయింది"

"చాలా గొడవ వుందే"

"నేనవరి బసకీ వెళ్లను. మేళం వెళ్లినచోట బ్రహ్మచర్యం ఆచరిస్తాను……వల్లకా దన్నాను"

"సరే"

"నూగుమూపాయల కాగితం చూపించాడు. నేను జవాబు చెప్పలేను"

"…………………"

"మన్నాడు మధ్యాహ్నం సభలో నేను గజ్జెకట్టివుండగా విప్పించి మరో సత్రకాయచేత కట్టించాడు. రాత్రి వూరేగింపులో నన్ను గజ్జెకట్టమన్నాడు"

"బోధపడింది. నీమీద పగపట్టా డన్నమాట"

"వాకబు చేశాను. మీ ప్రెసిడెంటుకి రూపతృష్ణ తప్ప మరేమీ లేదు. ఈకుట్ర అంతా యెలుగ్గొడ్డుది"

"మహార్వాసికోసమా!"

"చాటునా మాటునా గడ్డికరవడానికి. తెలిసిందా!"

"…………………"

"ఎంత కల్పనో చూశారా! సాధారణంగా మేము డబ్బు తెచ్చినవాడి పల్లా చేరనిస్తాం. అయితే, వాళ్లలో రసికులు నూటికొకడో యిద్దరో వుంటారు. తతిమ్మా అంతా—"

"ఎందుకూ! తెలుస్తూనే వుంది కాదూ!"

"నేను శిఫారసు చెయ్యడం అంటే యేమిటో తెలిసిందా మీ కిప్పుడు!"

"తెలిసిం దమ్మా"

"నే నంగీకరిస్తా ననుకోండి. అయితే మీ అబ్బాయి గారికి వుద్యోగం యివ్వడం నిరుకా!"

"గుమాస్తా అలాగే చెప్పాడు"

"అంటే, నాఆత్మద్రోహమూ, ప్రెసిడెంటుపశుత్వమూ కలిసి వొక బ్రాహ్మణకుటుంబానికి భుక్తి యేర్పరుస్తా యన్నమాట"

"..................."

"నేనంగీకరించకపోతే మీపిల్లల నోటిదగ్గిర అన్నం పడగొట్టినదా న్నవుతాను కూడానూ. కదుటండీ!"

"..................."

"కనక శాస్త్రుల్లుగారూ! ఈరాత్రి ప్రెసిడెంటుని తీసుకురమ్మని యెలుగ్గొడ్డుతో చెప్పండి"

"..................."

"వొక్క దమ్మిడీ అయినా పుచ్చుకో దని కూడా చెప్పండి"

"అమ్మా—"

"ఇంకా యేమిటి?"

"ఏమీ లేదూ. నేను వచ్చినదారినే వెళ్లిపోతాను. నువ్వు ఆత్మద్రోహానికి సిద్ధపడవద్దు"

"ఏం?"

"ఇంతకుత్రా? ఇంత ద్రోహమా? తనలాగా తార్చుకుకాడే. నన్నుకూడా తనలాగ తయారుచేస్తాడా యీనీచుడూ? నీకూ ప్రెసిడెంటుకీ యిదివరకే సమ్బంధం వుండనీ, నేను నీకే కాసో, రెండు కాసులో యివ్వవలసి వస్తుం దనీ సిద్ధపడివచ్చాను. పైగా నువ్వింత యోగ్యరాల వని యెరగనే యెరగను. నేను బ్రాహ్మణ్ణి. వేదం వల్లించాను. యాచన నావృత్తి. మరో నలుగుర్ని చూస్తూవుంటా నికముందు. కాని వొకవేశ్యని—కులాంగనలాగ ఆభిజాత్యం కల కళావతిని తార్చడానికి—స్వార్థంకోసం వొక శీలవతిని పులివాత పడెయ్యడానికి నేను సాహసించలేను. తల్లీ! నన్ను క్షమించు. నాకోరిక మరిచిపో. నాకు సెలవియ్యి........."

"వల్లకాదు. శాస్త్రుల్లుగారూ! కూర్చోండి...... నేనా పని చేసితీరాలి. న్యాయమూలంగా వొక బ్రాహ్మణకుటుంబానికి జీవనాధారం యేర్పడడం నాఅదృష్టం. నాజీవితంలో యిది వొక పవిత్రమైన సంఘటన. నేనెలాగా మగనాలిని కాను. పతివ్రత నంతకంటే కాను. కనక నేను పతితురాల నైపోను. నాకు విచారం లేదు. మీరూ విచారించకండి"

"తల్లీ—"

"ఇక నేను వినను. మీ రేమీ చెప్పవద్దు. ఇది యిలా జరిగితీరవలసిందే. చెప్పాను కానూ? పశువులతో సాహచర్యం మాకు పరిపాటే. శాస్త్రుల్లుగారూ! మీరు జెంగపెట్టుకోకండి. ఇందాకా నేను చెప్పిన మాటలు యెలుగ్గొడ్డుతో చెప్పండి"

"నన్ను—"

"ఏమీ చెప్పనివ్వను. మీరు మరోలాగ చేశారంటే మీరు నేర్చుకున్న వేదానికి ద్రోహం చేసినవా రవుతారు"

"నాకంఠాని కురి బిగించావమ్మా"

"మరి వెళ్లండి. ఎప్పుడేనా దర్శనం మాత్రం దయచేస్తూ వుండండి. అమ్మగారికి నాదండాలు మనవి చెయ్యండి"

"అమ్మా! నోరు కట్టేశావు. చేతులు కట్టేశావు. కాళ్లకి సంకెళ్లు తగిల్చావు. జీవచ్ఛవాన్ని చేసేశావు. ఏంయోగ్యత తల్లీ నీది! ఏం జన్మ తల్లీ నీది! వేశ్యాకులంలో నువ్వు తప్పపుట్టావమ్మా!"

"మాలో నాలాంటివాళ్లు—నాకల తన్నేవాళ్లు వేలున్నారు; కానిలోకం గుడ్డిది.........ఇకంతా అప్రస్తుతప్రశంస. దయచెయ్యండి"

".........ఎన్ని తిప్పలు కల్పించాడూ నాకూ! దేవుడు లేడూ! ఈద్రోహి—ఈఅప్రాచ్యుడు ముందుకు వస్తాడా!........."

౫

"అర్ధ రిచ్చారా నాయనా!"

"ఇవ్వనూ యిచ్చారు, వెంటనే పుళాక్కనూ పుళాక్కన్నారు"

"అయ్యో! అదేం పోయేకాలం!"

"ఏం చెప్పనమ్మా! అంతా బూడిదలో పోసిన పన్నీ రయిపోయింది. ఎక్కడ బయలుదేరామో అక్కడే వున్నా మిప్పుడు"

"నడుం విరిగిపోయింది.........ఇలా కూచో...
.....ఏం జరిగిందీ?"

"వింటే నువ్వు విచారిస్తావు. అంతా మరిచిపో. నాకు వచ్చిన పని చేసి నేనిక కుటుంబపోషణ చేస్తాను. నువ్వు 'రామా కృష్ణా" అంటూ వొక చోట కూచో"

"....................."

"నేను మేష్టరీ చెయ్యను మొర్రో అంటే పోరి నన్ను ట్రెయినింగుకి పంపావు. ఇప్పుడు వుద్యోగంకోసం నానా మూలకూళ్లూ కుడిచావు. చివరికి నీతిగా బతికే ఆశయ త్యానికి కూడా వ్రతభంగం చేశావు. ఏం చేసినా వుద్యోగం లేదు. ఏమంటే—అసడానికే వల్లకాదు"

"ఏం జరిగింది నాయనా?"

"ఏం చెప్పనమ్మా? రెండు సంవత్సరాలు ఖాళీ పడిన వుద్యోగం, మూడువందలు గడ్డితిని వొక కృష్ణా జిల్లా వాడి కిచ్చాడు. వొక మేష్టరు మూడు నెలలు సెలవు పెట్టగా అది నాకిచ్చాడు"

జీతం—"

"నెలకి పాతికరూపాయలు"

"మూడు మాసాలా?"

"అదేనా దక్కితేనా? వారంరోజులు కాలే దింకా ఆయన సెలవుపెట్టీ, "నాకిప్పుడు సెలవు అక్కర్లే" దంటూ మొన్ననే మళ్లీ పనిలో ప్రవేశించాట్ట"

"మరి నీ కెలా యిచ్చాడూ ప్రెసిడెంటూ?"

"నిన్నరాత్రి నాకు ఆర్డరు రాశాడు. ఇవాళ నేన క్కడ వుండగానే, టపాలో, ఆయన మళ్లీ తన పనిలో చేరినట్టు రిపోర్టు వచ్చింది"

"చివరికి ఫలితం యేమిటి నాయనా?"

"బుర్ర గోక్కుంటూ నేనింటికి రావడం"

"వాడమ్మకడుపు కాలిపోను. బతికి బట్టకడతాడా యీ ప్రెసిడెంటు?"

"బోలెడుసొమ్ము తగులడింది. సిక్షేపంలాంటి ఆవు పోయింది. చివరికి నత్తికి చేతులు. సావుకారుదగ్గిర చేర నిమ్మంటే విన్నారా? వుద్యోగం—వుద్యోగం—చేతు లారా కొంప ముంచేశారు మీనాన్న"

"ఇల్లా అవుతుం దని నాకేమి తెలుసునూ? అయిన వాళ్లూ, కానివాళ్లూ కూడా వుద్యోగాలు చేస్తూ విరగ బడిపోతూవుంటే నాకొడుకూ్కడా అలా వుండా లని గంపెడాశ పెట్టుకుని యింగ్లీషు చదివించాను; కాని దైవా నుగ్రహం లేదు. నేనేం చెయ్యగలనూ."

"నువ్వింకేమీ చెయ్యనక్కర్లేదు. నీశక్తికొద్దీ నన్ను చదివించిచావు. అది నాశుభం కోరే. సందేహం లేదు; కాని వుద్యోగం నాతత్వానికి సరిపడదంటే విన్నావు కావు......అయిం దేదో అయిపోయింది. నీతరం వేరూ, నాతరం వేరూనూ. మీకాలపువాళ్ల ఆశలూ, అవస రాలూ వేరూ, మాకాలపువాళ్ల ఆశలూ, అవసరాలూ వేరూనూ. ఇది మీకు తెలవదు. చెబితే బోధపడదు. మీతప్పల్లా యిదే"

"అయితే నువ్విప్పు డేం చేస్తా నంటావు నాయనా?"

"అమ్మా! కాలం మారింది. దృక్పథాలు మారిపో యాయి. వృత్తికి గౌరవం చూపే రోజు లివి. నలుగురికీ వుపకరించీ వస్నే మంచి వృత్తులే. మంచీ చెడ్డా నడకలో వుంది కాని వృత్తిలో యేమీ లేదు"

"తెసిగించి చెబుదూ నలిపి చంపకా"

"కోప్పడకు నాన్నా!"

"మతిపోయి యేడుస్తూ వుంటే వుపన్యాసం పేల గొడతా వేమిటి మరీ?"

"అయితే విను. నేనిక కాఫీహోటలూ, భోజనం హోటలూ పెడతాను"

"అయ్యో!"

"వోరి నీమొహం మండా......"

"తిట్టకండీ"

"అమ్మా నువ్వూరుకో. తిట్టనియ్యి. నాన్నా! మన వూర్వు లెప్పుడేనా నౌకరి చేశారా? మనవంశాని కది మంచిదేనా? ఇంగ్లీషు మనకి కులవిద్యేనా?"

"అయితే?"

"వుద్యోగా లంటే గౌరవం వుండీ రోజుల్లోనూ, అవి దొరికే రోజుల్లోనూ నా కింగ్లీషు మొదలుపెట్టించావు. నేను తయారయాటప్పటికి గ్రహాలు వక్రించాయి"

"నీది దరిద్రజాతకం. అంచేతే నాకష్టమంతా బుగ్గయి పోయింది"

"ఎప్పుడూ శాపాలే మీకూ. ఇప్పు డేనా పూరు కోండి"

"నువ్వు నోరు మూసుకో, మనవాడు పూటకూటిల్లు పెడతానంటే చంకలెగరేసుకోమంటావూ!"

"నావుద్యోగం కోసం నువ్వు చేసిన పనులు అంత కంటే మంచివా నాన్నా!"

"ఛీ, అప్రాచ్యుడా!"

"నువ్వు తిడతా వని యెరుగుదును; కాని అది తప్ప నేను మరోటి చెయ్యాను"

"ఈపూరే అన్నమాటేమిటి నాయనా? మరో ప్రెసిడెంటు లేదూ లోకంలోనూ? పూటకూటిల్లేమిట్రా నలుగురూ నవ్వడానికీ?"

"అమ్మా! నీకసలే తెలవదూ ప్రపంచకం. మీకేమి చెప్పి వొప్పించడం కష్టం అయినా విను. తెనుగువాడికి యిల్లు కదిలితే తన దేశంలోనే తెనుగుభోజనం దొరకడం లేదు. "అయ్యో! నాతత్వానికి సరిపడ్డ భోజనం దొరకడం లే" దని విచారం కూడా లేదు. అక్కడక్కడ మనవాళ్లు కొందరు హోటళ్లు నడుపుతున్నారు; గాని వాళ్లలో చాలామందికి వ్యవహారజ్ఞానం లేదు. వచ్చి వాళ్లకి అభిమానముగ్నా తక్కువే. అంచేత నేను కొత్త పద్ధతులతో హోటలు పెడతాను. కాఫీహోటలుకూడా వుంటే బాగా కిటుతుంది. దేశదేశాలవాళ్లు మన దేశం వచ్చి కాఫీహోటళ్లూ, భోజనహోటళ్లూ పెట్టి లక్షాధికారు లవుతూ వుండగా మన తెనుగుకుర్రాళ్లు దూరం యోచించలేక దిక్కుమాలిన నౌకరీలకోసం యెగబాకుతున్నారు. పైగా ఆవిజాతీయ పదార్థాలు తినడంవల్ల తెనుగురక్తం చప్పబడిపోతోంది కూడానూ"

"దేశం యెలా పోతే నీకేమిరా?"

"అయితే యేమృత్తయితే యేమమ్మా?"

---

# గద్వాల పెదసోమభూపాలుడు

క్రీ. శ. ౧౬౬౩ – ౧౭౧౨

మారేమండ రామారావుగారు ఎం, ఏ, బి, ఇడి

గద్వాలసంసంస్థానము ప్రకృతాంధ్రసంస్థానములలో నెల్ల నగ్రగణ్యమై, యనేకశతాబ్దములనుండియు విద్యాపోషణమునకును వితరణవైభవములకును ఖ్యాతిగాంచి నేడు నైజాంరాజ్యాంతర్గతమై యున్నది. క్రీ. శ. ౧౨౯౦ లో కాకతీయప్రతాపరుద్రదేవచక్రవర్తి యీసంస్థానీకుల మూలపురుషునికి కృష్ణాతుంగభద్రానదులమధ్యనున్న కొన్నిసీమలపై నాడగౌడగియను నధికార మొసంగెను. తరువాతివారు విజనాడగౌడులనుపేరుతో క్రీ.శ. ౧౬౬౩ వరకు నాయధికారమును నెరపుచుండిరి. పిమ్మట పెదసోమభూపాలుడు బాహుబలమున ననేకసీమలను జయించి యొకస్వతంత్ర్యరాజ్యము నేర్పరచి, గద్వాలదుర్గమును నిర్మించి యారాజ్యమునకు కేంద్రముగ జేసెను. ఇదియే నేటి గద్వాలసంస్థానము.

సోమభూపాలుడు మహాశూరుడై యనేకాద్భుతకార్యముల నొనర్చెను. అతనిసాహసకార్యములు నేటికిని జనశ్రుతిలో జీవించియున్నవి. నైజాంరాజ్యమునను కర్నూలుప్రాంతమునను తందానపదముల బాడువారతని చరిత్రమును "శోభనాద్రికథ" యను పాటగా పాడుచున్నారు. ఇట్టి ప్రఖ్యాతవీరపురుషుడగుటవలననే యీతని జన్మమునుగూర్చి యెన్నియో గాథలు కల్పింపబడినవి. ఇత డొక సామాన్యకర్షకుని పుత్రు డనియు, దండ్రి దైవోపహతుడై యాస్తిని గోలుపోయి దేశాటనము జేయుచు మరణించెననియు, నట్టకేల కీబాలుడు పూడూరుజేరి యచట నైజనాడగౌడుగ నుండిన బక్కమ్మ యను నామె యనుగ్రహమును బడసి యామెచే దత్తుచేసికొనబడెనని యు పైకథలో నున్నది. స్థానిక చరిత్రములలోని గద్వాలకైఫీయతులో నైజనాడగౌడులలోని యొకశాఖకు జెందిన కుటుంబములో బుట్టిన సోమన్న యను బాలుని పైని చెప్పిన బక్కమ్మ పెంచుకొనెనని చెప్పబడియున్నది. ఇందుకు విరుద్ధముగ నీసోమభూపాలుని మనుమని కాలమున రచింపబడిన యధ్యాత్మ రామాయణాదిగ్రంథములలో నితడు పెద్దారెడ్డి యను విజనాడగౌడుకును బక్కాంబకును బుత్రుడని వర్ణింపబడినాడు. ఇదియే వాస్తవమును విశ్వసనీయము నని తోచుచున్నది. ఈపెద్దారెడ్డి పూడూరుదుర్గమున అపుత్రకు డగు మామ యింటనే యుండి

రైజదరూరుసీమలపై దనకు పారంపర్యముగ వచ్చిన నాడగౌడధికారమును నెరపుచు క్రీ. శ. ౧౬౩౦ ప్రాంతమున మరణించెను. అప్పటికింకను సోమభూపాలుడు బాలు డగుటచే దల్లియగు బక్కమ్మ నాడగౌడధికారమును వహించెను.

క్రీ. శ. ౧౬౬౩ లో సోమభూపాలుడు నాడగౌడయ్యెను. ఆకాలమున రాయచూరు దోఅబ్ విచిత్రము లగు పరిస్థితులకు లోనై యుండెను. దేశమంతయు చిన్నచిన్న స్వామ్యములుగ విభజింపబడి యొక్కొకటి యొక్కొక పాళెగాని స్వాధీనమున నుండెను. ఇందు గొందరు భూస్వాములును గొందరు కేవలమును గ్రామములను వసూలుజేయు నధికారము గలవారును మరిగొందరీ రెండు హక్కులును గలవారు నై యుండిరి. ఏటేటను గొంతకప్పమును గట్టుచు వీరు పేరునకు మాత్రము బిజాపురసుల్తానులకు లోబడి యుండిరి. ఇట్టి పాళెగార్లలో నైజనాడగౌడగు పెదసోమభూపాలుడు నొకడై యుండెను. మహాపరాక్రమసంపన్నుడు నధికారకాంక్షియు నగు నితని కీస్థితి గౌరవహీనముగ గన్పట్టెను ఎట్లైనను బిజాపురసుల్తానుపై దిరుగుబాటు జేసి, యితరపాళెగార్లను జయించి యొక స్వతంత్రాంధ్రరాజ్యమును స్థాపింపవలె నని యితడు దృఢముగ సంకల్పించెను.

తన సంకల్పమును నెరవేర్చుకొనుటకు ముందాత్మరక్షణ మావశ్యక మని యెంచి సోమభూపాలుడు దన నివాసస్థానమగు పూడూరుదుర్గమును బాగుచేయించెను. ఆసందర్భమునం దతని కొక నిక్షేపము దొరకెను. కాని నరబలి యొసగిన గాని యది స్వాధీనము గాకుండెను. ఏమైనను సరియే దేశరక్షణార్థమై రాజ్యస్థాపన మొనర్చుటయా? లేక బ్రహ్మహత్యాపాతకమునకు వెరచి యాకార్యము నుండి విరమించుటయా? యను సమస్య యతనిని బాధించెను. తుదకీరాజు సర్వప్రజారక్షణార్థమై యొక జీవి ప్రాణములను గొనుటలో తప్పులేదనియు, నందువలన గలుగు పాపము నింకొక విధమున బరిహారము జేసికొనవచ్చు ననియు నిశ్చయించి కేశవు డను బ్రహ్మచారిని బలియిచ్చి నిక్షేపధనమును గైకొనెను. దీనితో నవతి కాలముననే సోమభూపాలు డొక పెద్ద సైన్యమును సమకూర్చుకొని తన యభీష్టమును దీర్చుకొన సమయమునకై వేచియుండెను.

క్రీ. శ. ౧౬౮౬ లో మొగలురాజప్రతినిధి యగు నౌరంగజేబు దక్షిణాపథసుహమ్మదీయరాజ్యముల నొక్కొక్కటిగ జయించుచుండెను. బిజాపురరాజ్యము మాత్ర మతనికి సులభముగ సాధ్యము కాలేదు. అంతట తంత్రజ్ఞుడగు నౌరంగజేబు మిత్రులకై వెదుకజొచ్చెను. సుల్తాను సామంతులలో నెల్ల నైజనాడగౌడు ప్రబలుడనియు, స్వాతంత్ర్యాభిలాషియై యుండె ననియు దెలిసికొని యతడు సోమభూపాలుని రైజదరూరుసీమలపై రాజాధికారము నొసంగి యనేకవిధముల బహూకరించి యతని సాహాయ్యమును గోరెను. రాజనీతివిశారదుడును, దూరదర్శియు నగు సోమభూపాలుడీరాయబారము నంగీకరించిన దాను స్వతంత్రింపగల్గుటయే గాక, సమాల్యమగు మొగలుచక్రవర్తుల సాహాయ్యమును గూడ బడయునగు ననియు దన్మూలమున దన రాజ్యమునకు స్థైర్య మేర్పడు ననియు నూహించి యౌరంగజేబు మైత్రి నంగీకరించెను. ఈసంగతి దెలిసికొని బిజాపురసుల్తాను రాజా సోమభూపాలుని శిక్షించుటకై యొక పెద్ద సేనను బంపెను. ఆతురుష్కసైనికులు దనూరుదుర్గమును ముట్టడించిరి. ఇట్టి యవాంతరమునకు సంసిద్ధుడుగనే యున్న సోమభూపాలుడు ప్రబలసైన్యముతో నేగి సుల్తానుబలముల నోడించి తరిమివేసెను. పిమ్మట సర్వస్వతంత్రుడై యితడు తన సైన్యముల నౌరంగజేబుకు బిజాపురము ముట్టడిలో సహాయముగ బంపెను.

ఈవిధముగ సోమభూపాలుడు స్వతంత్రరాజ్యమును స్థాపింపగల్గెను. ఇటుపై దానిని విస్తరింపచేయుటకై యతడు ప్రయత్నించెను. అజేయమగు సైన్యముతో నతడు తుంగభద్రానదిని దాటి కర్నూలు బళ్ళారిమండలముల బ్రవేశించి యలజడిపరచెను. క్రీ. శ. ౧౬౮౯-౯౯. నడుమగల పదిసంవత్సరముల కాలములో నతడు బన్గానిపల్లె, సిరువెళ్ళ, నంద్యాల, సిద్ధాపురం, భండాత్మకూరు, అహోబిలము, ఆదవోని సీమలను జయించి వానిపై నిరంకుశాధికారమును నెరపుచుండెను. రాజ్యము విస్తరించుటవలనను, ప్రబలురగు శత్రువుల సంఖ్య పెరుగుటవలనను శిథిల మగు పూడూరుదుర్గము దనకు రక్షకస్థానముగ నుండజాల దని నిశ్చయించి సోమభూపాలుడు పూడూరున కైదుమైళ్ళ దూరమున సయ్యదుమియ్యా యనువాని స్వాధీనమునందున్న గద్దెపల్లె యను గ్రామమునవద్దనుండిన పెద్ద మైదానమును బలాత్కారముగ నాక్రమించెను. ఇందీ రాజు శత్రుదుర్భేద్య మగు స్థలదుర్గమును గట్టించి, దానిని తనరాజధానిగ నొనర్చుకొనెను. ఇదియే నేటి గద్వాలదుర్గము. ఇది క్రీ. శ. ౧౬౯౨-౧౭౦౪ వరకు నిర్మింపబడెను.

ఈవిధముగ సోమభూపాలుడు స్వయంకృషిచే మహోన్నతస్థితికి వచ్చెను. కృష్ణాదక్షిణభాగమునం దతడు నిరంకుశుడై యుండెను. తాను మొగలుసింహాసనము నధిష్ఠించిన పిమ్మట గూడ నౌరంగజేబు దీపూర్వమిత్రుని మరువలేదు. రాయచూరు దోఅబ్‌లో నిట్టి మిత్రుడుండుట మిక్కిలి లాభకర మని యెంచి యాచక్రవర్తి సోమభూపాలుడు నూతనముగ జయించిన సీమలపై నతనికి సర్వాధికారము నొసంగుచు నతని రాజత్వమును స్థిరపరచుచు క్రీ. శ. ౧౭౦౪ లో నొక సన్నదు నొసంగెను. ఈవిధముగ నేటి గద్వాలరాజ్య మౌరంగజేబుసాయముచే యామోదముతో నారంభ మయ్యెను.

వీరపురుషు డగు సోమభూపాలునికి చాలకాల మింట కాలు నిలువకుండెను. ఔరంగజేబుచే గౌరవింపబడిన యనతికాలముననే యతడు రమణయ్య యను నుద్యోగిని గద్వాలలో నిలిపి, మరి యొకసారి విజయయాత్రసాగించెను. ఔరంగజేబు మరణించిన పిమ్మట దక్కనులోని సామంతులు స్వతంత్రించిరి. ఈయల్లకల్లోలములలో సోమభూపాలునికి కర్నూలుసీమపై నాడగౌడు మున్నగు

రసుములు కనూలగుట దుర్లభమయ్యెను. అందువలన క్రీ. శ. ౧౭౧౦ లో నతడు కర్నూలు దుర్గమును ముట్టడించి వశపరచుకొని రెండేండ్లు పరిపాలించెను. దక్కను సుబేదారగు నైజాముల్ ముల్కు క్రీ. శ. ౧౭౧౨ లో నీకర్నూలు దుర్గమును జయించుటకై దిలీల్ ఖానను సేనానిని బంపెను. సోమభూపాలు డీ తురుష్కసేనానిని నిడుదూరుమిట్టల వద్ద నెదుర్కొనెను. అపుడు ఘోర మగు యుద్ధము జరిగెను. సోమభూపాలు డవక్రపరాక్రమముతో శత్రుసేనలను చెండాడెను; కాని దైవసంకల్పముల ననుసరించి విజయలక్ష్మీపాణిగ్రహణ మొనర్పవలసిన సమయమున వీరస్వర్గము నలంకరించెను.

ఈవీరశిఖామణి పారంపర్యముగ వాడిగొడగి ననుభవించుచుండిన తన వంశమునకు రాజ్యాధికారము నొసంగెను. బిజాపూర దాస్యమును బారద్రోలి స్వాతంత్ర్యమును నెలకొల్పెను. కృష్ణాతుంగభద్రామధ్యదేశము నే గాక కర్నూలు బళ్ళారి మండలముల లోని గొన్ని సీమలను గూడ జేర్చి యొక స్వతంత్రరాజ్యమును నెలకొల్పెను. ఔరంగజేబు పాదుషా యంతటివాని కాప్తమిత్రుడై యుండెను. ఈసోమభూపాలునకు అమ్మక్క, లింగమ్మ, రామక్కయని ముగ్గురు రాణులుండిరి. తమ్ముడగు నిరగరెడ్డి సర్వసేనాధ్యక్షుడుగ నుండెను. ఈరాజునకు దైవభక్తి యపారముగ నుండెను. మన్న నిక్షేపలాభములకై తాను బలియొసంగిన బ్రహ్మచారిపేరిట నీతడు గద్వాలదుర్గమున కేశవస్వామి యాలయమును గట్టించి, తన రాజ్యమును సంపదను సర్వస్వము నతనికి ధారపోసి యాదేవునికి బ్రతినిధిగ రాజ్య మేలుచుండెను. కత్తిని బట్టుటయందే గాక నీరాజన్యుడు గలము బట్టుటయందుగూడ సిద్ధహస్తుడై యుండెను. అత్యద్భుత మగు కవితాశక్తి కలిగి యీరాజశేఖరుడు జయదేవకవి రచియించిన గీతగోవిందకావ్యమునకు రసవంత మగు నాంధ్రానువాద మొనర్చి, యందలి శ్లోకములకు పద్యములను, అష్టపదులకు చూర్ణికలను రచించెను. ఇంతియగాక నానా విద్వాంసులను, విద్యలను బ్రీతితో నాదరించెను. ఏటేటను గార్తికమాసమున పండితులకును, మాఘమాసమున కవిగాయకులకును సన్మానములను జేయు నాచారము నీసోమభూపాలుడే నెలకొల్పెను. ఈయాచారము నేటికి నవిచ్ఛిన్నముగ సాగుచున్నది. నేడు గద్వాల సంస్థానము విద్వద్గద్వాలయని పేరుగాంచినది.

ఇట్లు క్లిష్టము లగు పరిస్థితులలో బ్రత్యేకాంధ్రరాజ్యస్థాపన మొనర్చి, దానికి విద్యాపోషణమునే ముఖ్యాదర్శముగ నేర్పరచి, మహాశూరుడై సమకాలికులలో వీరశిఖామణి యని పేరెన్నిక గాంచిన యీగద్వాలపెదసోమభూపాలు డాంధ్రులకు జిరస్మరణీయుడు.

---

# బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి

ఉభయభాషాప్రవీణ గంవ్వారి సూర్యనారాయణమూర్తిగారు

వ్యాసుని ఆశ్రమం నైమిశారణ్యంలో. ఆశ్రమం దగ్గిరే పెద్ద మర్రిచెట్టు ఎర్రటిఊడలు జడలకిమల్లే వేళ్లాడవేసుగుని తలవిరబోసుగున్న ముసలిమునీశ్వరుల్లా వుంది. ఎండవేళ ఆచెట్టుమీద రకరకాల పక్షులు కష్టసుఖాలు చెప్పుగుంటూ మునుల శాస్త్రచర్చ వింటూవుంటాయి. ఆ చెట్టు ఎప్పుడు చూసినా పదిమంది పిల్లలతో వున్న సంసారంలా వుంటుంది. వ్యాసుడు తన శిష్యులందరికీ ఆ చెట్టుకిందే పాఠాలు ఉపదేశిస్తుంటాడు. వ్యాఘ్రాసనం మీద వ్యాసుడు కూర్చున్నాడు. కమండలం దగ్గిరగా వుంచుగున్నాడు. జేగూరురంగు కౌపీనం. తెల్లగా పండిపోయిన పొడుగైన గడ్డం. ఒళ్లంతా కప్పే జడలు. బ్రహ్మతేజస్సు గల నుదుటిమీదా శరీరంమీదా, విభూతిరేఖలు. రెడ్డికం వేసి కూచున్నాడు. అతనిచుట్టూ పదిమంది శిష్యులు మెత్తని రోమాంచం గల కృష్ణాజినాలు పరుచుగు కూచున్నారు. చేతుల్లో తాటాకు గ్రంథాలున్నాయి. ఆవేళ బోధించవలసిన పాఠం వ్యాససంహితలో ఇంద్రియవశీకరణఘట్టం.

వ్యాసుని అభిమానశిష్యుడు యాజ్ఞవల్క్య. గ్రహణధారణపటువైన నిశితబుద్ధి కలవాడు అతడు. ఒక్కొక్కప్పుడు యాజ్ఞవల్క్య ప్రశ్నిస్తే వ్యాసుడు నాలుగైదు ఘడియలదాకా తదేకధ్యానంగా పరామర్శిస్తేనే గాని సమాధానం చెప్పలేకపోయేవాడు. ఏవో ప్రశ్నలు వేస్తూ పాఠం జరగనిచ్చేవాడు కాదు. సహపాఠకులకి ఇతనంటే అందుకే కోపం. ఏరోజునైనా అతడు లేకపోతే ఆవాళ రెండుమూడు పత్రాలు చులాగ్గా దాటవలసిందే. వ్యాసుడు కళ్లుమూసి. "అస్మద్గురుభ్యో నమః" అని ప్రారంభించేడు. శిష్యులంతా ప్రార్థనశ్లోకాలు చదివి గ్రంథాలు తెరిచేరు. వ్యాసుడు నిన్నటి తరవాయి

అని "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి" అని గంభీరంగా ఎదుట వున్న యాజ్ఞవల్క్య మొహం కేసి చూస్తూ వ్యాఖ్యానం చేస్తున్నాడు. కాని అతని మొహంలో వ్యతిరేకభావం బాగా స్ఫురిస్తోంది. వ్యాసుల వారి వ్యాఖ్యానం పూర్తి అయింది. మిగిలినవాళ్లంతా యాజ్ఞవల్క్య కేసి చూసి ముందుది అందుకోపోతున్నారు. వెంటనే అతడు గురువుగార్ని ప్రశ్నించడం మొదలెట్టేడు.

"గురువుగారూ! ఏమిటండీ ఈశ్లోకం ఇల్లా రచించేరు?"

"ఏంనాయనా! ఎల్లా వుంది?"

"పూర్తిగా వ్యతిరేకంగా వుంది గురుదేవా!"

"ఏమిటోయ్ ఆవ్యతిరేకం"

"ఏమిటంటారేమిటి? మనం ఏపనిచెయ్యమంటే ఆ పని చేసి మనచెప్పుచేతల్లో వుండే ఈ యింద్రియాలు మన్ని వశపరుచుగుంటాయా? ఇంతకంటే ఆత్మవంచనం వుంటుందా!"

"నాయనా! ఇది వంచన కాదోయ్. అనుభవపూర్వకంగా వ్రాసినదే"

"అన్నన్నా! అనుభవమా! మహాపండితులైన మీరే యిల్లా అంటే యెల్లాగండీ!"

"నేనే అన్నాను. ఒప్పుగుంటావా? ఒప్పుగోవా!"

"క్షమించండి. నే నంగీకరించలేనండి. మీవంటి వృద్ధులు అనవలిసిన దంటే మా భాగేనండి"

"వెర్రివాడా! నువ్వు ఎరగవు. మహామహులంతా ఇంద్రియాలకి లొంగిపోయేరు. ఋష్యశృంగుడువంటి మహర్షులు, విశ్వామిత్రుడులాటి బ్రహ్మర్షులూ కూడా లోబడ్డారు ఇంద్రియాలకి. ఎన్నెన్ని అనుభవాలని బట్టి రాసిన కారిక అనుకున్నా విది"

"ఐనా సరేనండి. నావంటివాడి కిది ఎల్లాగో వుందండి"

"అయితే ఇప్పుడు నీ అభిప్రాయ మేమిటి?"

"గురుదేవులకు కోపం వస్తుం దేమో?"

"ఎంతమాట? నీయభిప్రాయం చెప్పు. నాకేమీ కోపం రాదు"

"మరి చెప్పేక అల్లా దిద్దాలి సుమండీ!"

"నువ్వు చెప్పేక ఆలోచిస్తాను. ముందు చెప్పు"

"ఐతే ఇక్కడ "విద్వాంసం నాపకర్షతి" అని వుంటే బాగా వుంటుందండి. మీకు నచ్చిందా లేదా?"

"నీపట్టుదలకి సంతోషిస్తాను. గాని నేను రాసిన గ్రంథం కనక నాచేతులతో నేను దిద్దలేనోయ్. దాన్ని అల్లాగే వుంచి ముందు చదువు"

"అబ్బే, అలాకాదండి. ఇటువంటి ఉద్గ్రంథంలో, అందులోనూ గురుదేవులు వ్రాసిన దాల్లో ఇంత తేలిక మాట ఉండకూడదండి"

"సరే. ఈగంటంతో ఆశ్లోకాని కెదురుగా నీపాఠం కూడా రాయి" [మిగిలినవా రంతా ఇల్లాగే అంటారు. యాజ్ఞవల్క్య మాత్రం "అపికర్షతి" అనే దానిమీద గీసి కుండలీకరించి "నాపకర్షతి" అని నెత్తిమీద రాసేడు. ఆవేళకి పాఠం అయింది].

శిష్యులంతా సమిధలూ, బరిహాన్సూ, పళ్లూ, తెద్దామని లోఅడవికి వెళ్ళేరు. దారిలో యాజ్ఞవల్క్య సహాధ్యాయులతో తన వాదం సాగిస్తూనే ఉన్నాడు. అతని కెంత తోస్తే అంతే. చాలా పట్టుదలమనిషి. అందులోనూ నిగ్రహశక్తి కలవాడవడంచేత గురుదేవులు వ్రాసిన దాన్ని కూడా ఖండించేడు. వ్యాసులవారికీ విషయం పూర్తిగా తెలును. కాని కుర్రాడవడం చేత అనుభవజ్ఞానం తక్కువని సమాధానపడ్డారు. చెప్పాయించేడు.

వ్యాసులు కూడా తన పర్ణశాలకి వెళ్ళేడు. అక్కడ చెత్తాచెదారం లేకుండా అద్దంలా తుడిచిన ప్రాంగణంలో తన ఆసనం పరుచుకుని కూచున్నాడు. పక్కనే బాలహరిణాలు నెమరులు వేస్తున్నాయి. రెండుఘుళ్ల పొద్దుంది. గుండ్రంగా నెరిపి ఎండబోసిన నివ్వరిధాన్యం మునిపిల్లలు ఎత్తి అరుగులమీద పోస్తున్నారు. చిన్నపిల్లలంతా నీరెండలో ఆడుకుంటున్నారు. ఈ సందర్భంలో స్మృతికివచ్చిందది కాబోసు వ్యాసుడు దిగ్గున లేచి ఇంట్లోకి వెళ్ళి యాజ్ఞవల్క్య పుస్తకం ఈవలికి తెచ్చి ఆ రోజుపాఠందగ్గిర తీసి నిలబడే చూస్తున్నాడు. ఆపత్రంలో అతడు చేసిన పని కళ్లపడింది. కొంచెం మనస్సు

నొచ్చింది. మిగిలిన వాళ్ల పుస్తకాలల్లో ఏమీ దిద్దుబాటు లేదు. పుస్తకాలు ఎప్పటిలాగే పెట్టెసేసు లోపున బుర్ర వంకిస్తూను. ఈవలికొచ్చి యథాప్రకారంగా చెయ్యి వెనక్కి ఊతేసుకు కూచుని కుడిచేత్తో గడ్డం నిమురుకుంటూ దీర్ఘాలోచన చేస్తున్నాడు ఏమిటో. కొంతసేపటికి సంధ్యాకాల మయింది. దగ్గరే వున్న కొండకోనకి వెళ్లిపోయేడు సంధ్యాకృత్యాలు తీర్చుకుందికి. శిష్యులు అంతా వచ్చి తెచ్చిన వన్నీ ఆశ్రమంలో భద్రపరిచి వారుకూడా వెళ్లిపోయేరు.

* * * * *

ప్రతీరోజూ పాఠా లంటే ఎంత శ్రద్ధాభక్తులున్న వాళ్లకేనా విసుగు రాకమానదు. అధమం ఒకనెల వరకూ హాయిగా పిండివంటలతో భోజనాలు తప్ప మరేమీ లేదని విద్యార్థు లంతా మురిసిపోతున్నారు. ఈసంగతి గురుదేవుల మాట సందర్భాన్ని బట్టి సూచాయగా తెలిసింది. ఆవేళ అందరి మొహాల్లోనూ నూతనసంతోషం పొటకరించింది. వ్యాసు లది కనుపెట్టేడు. పాఠానికి ముందే ప్రారంభించేడు.

"నాయనా! ఇంద్రుడు యాగం చేస్తున్నాడు. మన్ని అందరినీ రమ్మని ఆహ్వానం పంపేడు. మనమంతా వెళ్లాలి"

"......................"

"ఏమి? ఏమన్నారు.?"

"అల్లాగే వెడదా మండీ"

"ఐతే ఇంటిదగ్గిర వుండేవా రెవరు"

[ఒకరి మొహం కేసి ఒకరు చూసుకుంటారు నువ్వుండ మంటే నువ్వుండిపో అనే భావంగా]

"నేనుంటా నండీ—నేనుంటా నండీ—నేనుంటా నండీ"

[యాజ్ఞవల్క్య అనువూ మినువూ లేకుండా వుంటాడు]

"ఏమోయ్! నీమాట?"

"తమ సెలవు. ఉండిపొమ్మంటే వుంటానండి. రమ్మంటే వస్తాను"

"నాయనా! మీరందరూ అజాగ్రత్త మనుషులు. అందరికీ ఒళ్లెరగని నిద్దర్లే. అన్నివిధాలా మన యాజ్ఞవల్క్య సమర్థుడు. అతని జాగ్రత్త మీకు రాదు. అతణ్ణే ఉంచి మనం వెడదాం. తెల్లవారగట్ల ప్రయాణం. మీ అంగవస్త్రాలు, ధావళీలు, మూటగట్టుకోండి. పుస్తకాలు కూడా తెచ్చుకోండి వీలైనప్పుడు చదవవచ్చు"

"చిత్తం గురుదేవుల సెలవు ఎల్లాగో అల్లాగే"

"అందరూ ఒకచోట పరుండండి"

"అల్లాగేనండి, మనశాలలో పరుంటామండి"

"మరి పాఠం కానియ్యండి"

[శిష్యులు చదువుతారు. పాఠం పూర్తి అవుతుంది. వ్యాసులు ప్రయాణసన్నాహం చేస్తూంటాడు ఇంటి దగ్గర.]

"నువ్వు మా అందరికంటే ఇష్టమైనవాడ వనీ, నమ్మకమైనవాడ వనీ, నీమీద ఆశ్రమ మంతా విడిచిపెడుతున్నారు గురుదేవులు"

"ఔను సుమీ ఒరే!"

"అదికాదురా! నాకు "మెలుకువ ఎక్కువ. చీమ చిటుక్కు మందంటే నేను లేచీవాణ్ణి. గురుదేవుల కది తెలుసు. అంచేతనే నన్ను ఉండమన్నారు కాని......"

"ఔనురా! అదీనీ, నువ్వు కాస్త చురుకైనవాడ వనీని"

"మీరెల్లా అనుకున్నా సరే! ఇది కొత్తగాదు. ఇదివరకి మీరందరూ ఆయనతో ప్రయాగ వెళ్లేటప్పుడు నేనేగా ఆశ్రమం కావలా. నాకు అలవాటే ఎక్కడెల్లా వుండాలో"

"ఇహ కబుర్లలో దిగితే పాఠం చింతన అయిందన్న మాటే. త్వరగా కానిస్తే పోయి మేమంతా మూటా ముడీ సర్దుకోవాలి"

"మరి కానియ్యండి. ఇహ మాటలు మానేదాం"

[అందరూ చింతన చేసుకుంటూ వుంటారు ఐన పాఠాన్ని]

* * * * *

అది చీకటిరోజు. ఆకాశమంతా కారుకమ్ముకుపోయీలా మేఘాలు ప్రళయతాండవం చేస్తున్నాయి. ఏనుగుతొండంలావుని వాన. గాలి విసిరికొడుతోంది.

నడుమనడుమ పిడుగులుచ్చుగు కొట్టినట్లు పెద్దపెద్ద చినుకులు పడుతున్నాయి. వృక్షాలన్నీ గుంజేసినట్టు అయిపోతున్నాయి. యాజ్ఞవల్క్య ఒక్కడూ అపర్ణశాలలో మిణుకుమిణుకు మంటూన్న దీపందగ్గిర ఏదో గ్రంథం చూసుకుంటూన్నాడు ఏకాగ్రధ్యానంగా. కుటీరం తడక తలుపుదగ్గిరసా కట్టివుంది. రాత్రిరి రెండుఝాముల వరకూ వాన కురిసి తగ్గింది. గాలి హోరు కూడా అణిగిపోయింది.

"బాబూ! దిక్కులేనిదాన్ని. ఈచీకట్లో కన్నూ కాలూ కనిపించడంలేదు. చలికిపక్కలు వంచుకుపోతోంది, అనాథని. నన్ను రక్షించండి మహాత్మా. పుణ్యముంటుంది"

అస్పష్టంగా వినిపించిన ఈ కేకకి యాజ్ఞవల్క్య పరకాయిస్తూ పుస్తకం మూసి వీధులోకి వచ్చి ఆచీకట్లో అటూ ఇటూ చూస్తున్నాడు ఇంకా చూరుచినుకులు పడుతూనే వున్నాయి. పల్లాలలో నిలిచిన వాననీళ్లు అద్దంలా మెరుస్తున్నాయి. మళ్లీ ఆకేక వినిపిస్తుంది. అతడు చాలా ఆత్రపడ్డాడు. ఆ అబలకు కాస్త ధైర్యం చెబుదామాఅని మళ్లీ గుమ్మంలో కూచున్నాడు. ఆమె జాలికలిగేలా ఏడుస్తోంది దగ్గిరగానే. అతని మనస్సు ఆగింది కాదు. ఏంబాధపడుతోందో పాపం అని తడక జారేసి ఆవైపు వెళ్లేడు.

"అమ్మా! ఎవరు మీరు?"

"నాయనా! నేను దిక్కులేని దౌర్భాగ్యురాలిని. నాకర్మవశంవల్ల ఈకారడవిలో పడవలసివచ్చింది. బాబూ! నాబట్టలు వర్షానికి తడిసిపోయేయి. నేను ముద్దయిపోయేను. ఆకలిబాధ అణుచుకుంటాను గాని ఈచలిబాధ సహించలేను. తండ్రీ! నన్ను ఈ రాత్రికి మీయింటిపంచ నుండనిస్తే ఈగుడ్డలు పిండుకుని తెల్లవారేక నాతెన్ను నేను చూసుకుంటాను"

"అమ్మా! నీకేమీ భయంలేదు. నీప్రాణానికి నాప్రాణం అడ్డు. నాతోకూడా రా అమ్మా!"

[ఇద్దరూ కలిసి శాలకి వచ్చేరు. అతడు తలుపు తీసి పమిదదీపాన్ని ఈవలికి తెచ్చేడు. ఆమె సిగ్గుతో కన్నెత్తి ఆతణ్ని చూసి తల వంచుకుంది. ఆగుడ్డిదీపం వెలుగులో ఆమె దర్శనం అతనికి మెరుపులా అయింది]

"అమ్మా! మీరు ఈదీపం వెలుగుని తడిబట్టలు పిడిచి ఆరేసుకోండి. ఆవైపు గదిలోకి వెళ్లండి"

ఆమె భయపడుతూ అల్లాగే చేసింది. బట్ట ఓవైపు పిండుకునిఆ వేపు చుట్టపెట్టుకుని రెండో వేపు పిండుకుంటూ బెదురుచూపులతో అతడున్న వేపు చూస్తూ గొంగు ఆరపెడుతోంది. అతడు రెండోదీపం వెలిగించి కుట్టకుంపట్లో నిప్పు చేసి కామకొమ్మని లోగుమ్మంలో వుంచి మళ్లీ గ్రంథం విప్పేడు, కాని ఏమీ తోచడంలేదు. చదివినదే చదువుతాడు. ఏదో పని ఉన్నట్లు లేవబోతాడు. మళ్లీ ఆమె సిగ్గుపడుతుం దేమో నని కూచునిపోతాడు.

"అమ్మాయీ! చలి తీరిందా?"

"తమ అవ్యాజప్రేమవల్ల తీరింది తండ్రీ! బట్టకూడా ఆరింది. ఈకుంపటి వేసినవల్ల"

"ఇంక ఆతలుపు వేసుకుని పడుకో. నేనిక్కడే పడుంటాను ఏమీ భయంలేదు"

"మీవంటి అన్న లుండగా నాకేం భయం తండ్రీ!"

ఇద్దరూ చెరో గదిలోనూ పడుకున్నారు. ఈతల యాజ్ఞవల్క్యకి మాత్రం నిద్దర లేదు. ఎంత బిగబెట్టుకున్నా ఆమెతో మాట్లాడుదామనీ, ఆమె వెతల్పుకళ్లు అస్తమానూ చూద్దామనీ, ఆశ గలిగింది. అతని బాధ చెప్పలేం. ఏమని పలకరించను? ఏవేళ పలకరిస్తే 'ఊ, అంటుందో' ఊహూ, అంటుందో? కాని ఒంటిగా వుంది గదా? రక్షించినవాడికి ఆమాత్రం ప్రేమభిక్ష పెట్టదూ? ఆ! జ్ఞాపకానికొచ్చింది" అని కొబ్బరిబొచ్చెలో నాలుగు జామిపళ్లూ, కొమ్మరటిపళ్లూ, పెట్టి తలుపు తియ్యమంటాడు.

"అయ్యా! తీస్తున్నానండి"

"నీకు చాలా ఆకలవుతూ వుంటుంది. నేను హాయిగా కడుపునిండా తిని నీవు తినకపోతే నాప్రాణం

వప్పదు. ఆభోజనంతో వునూరుమంటూ ఉండకూడదు. ఈబొచ్చెలో ఫలాలు అందుకో"

"అయ్యా! దయవుంచి ఆచిప్ప ఈలోపలగువ్మాంలో పెడతారా!"

"ఏం. ఎందుకంత భయం? ఇల్లా వచ్చి తీసుకోకూడదూ!"

"చిత్తం. తమ సెలవైతే......"

"అడుగులు తడబడుతూ వెళ్లి ఆవల్లు అందుకుంటుంది. రెప్పవెయ్యకుండా చూస్తాడామెను. గుభాలున లేద్దామనుకున్నాడు. కాని కాళ్లు లేచేయి కావు. ఒళ్లు చిరుకంప మెత్తింది. ఆమె గదితలుపు బిగిసింది.

"అయ్యయ్యో! మంచిసమయం దాటపెట్టేశేను. నాతలోచనంతా గంగపాలైంది. ఆహా! ఆమందగమనంలో అడుగడుక్కీ ముద్దులు మొలుస్తున్నాయి. ఆగులాబిచెక్కిళ్లదగ్గిర నల్లటి చారడేసి కళ్లల్లో తొలగా వెలిగే జ్యోతి నాగుండెల్లో మెరుస్తోంది. ఇంకెల్లాగ పలకరించడం? (రెండుగడియలుండి) మళ్లీ పిలుస్తాను..."

"అమ్మాయీ! ఓమాటు తలుపు తీస్తావా? ఆగది గూట్లో పుస్తకం తీసుకోవాలి"

"ఏగూట్లోనో కొంచెం ఆనవాలు చెప్పండి నేనిమట్టి గోడసందులోంచి అందిస్తాను. మళ్లీ మీకు శ్రమెందుకు?"

"నీకు తెలీదు. అందులో చాలావున్నాయి అల్లాటివి"

తలుపు తెరిచింది. లోపల అడుగు పెట్టేడు. సిగ్గు శిరస్సుని బలవంతంగా వొంచేసింది. ఏదో గ్రంథం తీసుకున్నా డాగదిలోనుంచి. మూలకి వొదిగిన ఆమెకేసి ఓవారచూపు విసిరేడు. ఈవల పడ్డాడు. కాని తాను చేస్తూన్న దందా తప్పేమో? అనిపించింది. ఎదిరి ప్రాణం ఏమనుకుంటుందో అని పశ్చాత్తాపపడ్డాడు. ఆమెతో

"ఇహ నేను తడిక తియ్యమన్నా తియ్యకు. లోపల గట్టిగా కట్టుగో. ఈవల నేనెన్ని కేకవేసినా సరే తియ్యకు. అసలు మాట్లాడవద్దు"

"అంత అవినయం చెయ్యగలనాండి పరాయింటి బిడ్డను. దయవుంచి మీరే పిలవడం మానుకోవాలి. ఇల్లా అన్నందుకు క్షమించండి. ఎల్లాగో ఈసగంరాత్రీ గడిచిపోతే......" [తలుపేసుకుంది]

కృష్ణాజినంమీద ఇటూఅటూ దొల్లుతాడు. ఓకునుకైనా పట్టదు. అర్ధరాత్రి. కారుచీకటి. ఊరుకాదు అడివి. ఇది ఎవ్వరూ లేని పర్ణశాల. దివ్యసుందరి అకాల ఫలంలా దొరికింది. ఇల్లాటప్పుడు రెండుసార్లు దాటపెట్టేను మంచిసమయం. ఇహ నాజన్మలో నేను ఈసాహసం చెయ్యలేను ఇప్పుడు దాటితే. ఇంక తెగిస్తాను. లేకపోతే...వ్యర్థం. తలుపు తియ్యవద్దన్నాను. ఒహవేళ గట్టిగా కేకలేసితే ఆమె, పెట్టనీ. ఎవరున్నారు ఈచుట్టుపక్కల? ఇహ ఆగదు నామనస్సు.

"అమ్మాయీ! ఈఒక్కమాటూ తలుపు తియ్యాలి. ఉషఃకాలం అవుతోంది. కమండలువూ, గావంచా తీసుకుని నదికి పోవాలి"

"అయ్యా! తమరేకాదూ ఇప్పుడు తియ్యవద్దన్నారు. మళ్లీ ఇంతలోనే ఇల్లా పిలుస్తారేం?"

"అల్లాకాదు. ఈమాటుకి తియ్యాలి. నిన్నిహ తియ్యమంటే వొట్టు, గాయత్రీసాక్షి"

"అయ్యో! ఒట్లు పెట్టుకోకండి. తియ్యవద్దన్నారు మీరు, ఏమైనా సరే"

"అప్పుడు ఊరికే అన్నాను నీతో. ఇప్పుడు తియ్యమంటున్నానుగా"

"అప్పుడో మాటా, ఇప్పుడో మాటానా? తాము మహర్షులు కారా? అబద్ధాలాడవచ్చా?"

"అబ్బెబ్బే! ఇందులో అనృత మేముంది? నాకమండలం తీసుగున్నాక......"

"ఏమైనా సరే! మీరు తియ్యవద్దన్నారు"

"ఇదుగో నీకు మాంఛి......అమ్మవు కావు!"

"నిజంగా నేను అమ్మనైతే తీస్తాను. ఆతరవాత మళ్లీ......"

"ఆఁ ఆఁ ఆఁ. ఏమన్నానూ? నీకేం భయం లేదు. తియ్యి. ఈచుట్టుపట్ల ఎవ్వరూ లేరులే."



శ్రీ వెలగపూడి రామకృష్ణ చౌదరిగారు

ఎం. ఏ. బి. ఎస్‌సి. ఐ. సి. ఎస్

పరిశ్రమల డైరక్టరు  మద్రాసు

"ఎవ్వరూ లేరనే తియ్యడానికి సందేహిస్తున్నాను. అదిగాక మీరు ఎంత తియ్యమన్నా తియ్యవద్దన్నారు. మీమాట తిరస్కరించనా! పాపంకాదూ"

"పాపమేమిటి వెర్రిదానా! ఇప్పుడు తీయకపోతే నామాట తిరస్కరించినట్టు కాదుకాబోను. ఓస్—"

"కాదు. అప్పు డన్నమాట మీదిగాని, ఇప్పుడు తియ్యమన్నమాట మీదికాదు. చాలా మారిపోయే రిప్పుడు"

"ఇదుగో తెల్లారిపోతోంది మరి. అబ్బా! పోనిస్తూ"

"......................"

తలుపమీద గుద్దుతాడు. గోడ కాలితో తన్నుతాడు. గట్టిగా అరుస్తాడు. బతిమాలతాడు తియ్యమని. లోపల నిశ్శబ్దం. ఇంటి చుట్టూ తిరుగుతాడు ఇంకా ద్వారా లేవేనా వున్నాయేమో నని. అతని మోహానికి పట్ట పగ్గాలు లేవు. ఒళ్లెరగడు. చేసే పని అర్థంకాదు. ఓమాటుగుప్పున తెలివి వచ్చినా మళ్లీ మత్తు కప్పేస్తోంది. పూర్తిగా ఇంద్రియాలకి లొంగిపోయేడు. బలవంతాన్ని తడక కాలితో తన్నిపెట్టి అడ్డంగా వున్న బద్దలు విరగ్గొట్టేసేడు. తలుక రెండుదవడలూ దగ్గిరసా నొక్కేసేడు. కిందనించి దూరి గదిలో ప్రవేశించి గుభీమని ఆమెను గట్టిగా నొక్కి పట్టుకున్నాడు. ఇంకా ఏవేవో చెయ్యబోయి మొహం చూసేడు. కూలబడిపోయేడు పాపం. శరీరం ముచ్చెమటలూ పోసింది. వొణికిపోతున్నాడు. పెద్దగడ్డం గొడరుద్రాక్షలూ, విభూతిరేఖలు. కాషీనం. పెద్దబొజ్జతో వ్యాసులవారు ప్రత్యక్షం.

"అయ్యయ్యో! ఇదేమిటోయ్ శిష్యా! అన్నన్నా!

"బలవా నింద్రియగ్రామో విద్వాంసం నాపకర్షతి. నాపకర్షతి. నాపకర్షతి" అనరే! ఎంతవాడవోయ్. ఇంత అజ్ఞానంలో పడిపోయే వేమిటి నాయనా! (ముక్కుమీద వేలుతో)

"మహాప్రభో! గురుదేవా!...నమస్తే...

"కర్షతి కర్షతి కర్షత్యేవ" నమస్తే...క్షమించండి. ఇహ నేను నగం చచ్చిపోయేను. మీ అద్భుతచర్య గ్రహించలేకపోయేను...జితోస్మి..."

వ్యాసులు పకపక నవ్వి యాజ్ఞవల్క్యని ఓదారుస్తాడు.

---

# వెలగపూఁడి రామకృష్ణచౌదరిగారు ఐ. సి. ఎస్

పండిత పెన్మత్స సత్యనారాయణరాజుగారు

రామకృష్ణుఁడు—విద్యాభ్యాసము

పాఁడిపంటలు గల పల్లెటూళ్లలో 'బెల్లమువానిపాలెము' గూడ నొక్కటి. ఆరోజులలో దానికి నేఁడున్నంతగాఁ పేరు ప్రతిష్ఠలు లేవు. శ్రీకృష్ణావతారముచే 'త్రేపల్లెకుం' బోలె రామకృష్ణుని పుట్టుకచే 'రేపల్లె' వెంగటంగల 'బెల్లమువానిపాలెము' నకుఁ గూడ వన్నెయు వాసియు గల్గెను.

బంగరు సలాకవంటి మేను, విశాలఫాలనేత్రములు. దీర్ఘమగు నాసిక, ఆజానుబాహువులు; ఠీవి గల నడక, పిలకజుట్టు, పంచకట్టు గల రామకృష్ణుని, కన్నతండ్రి క్రమకులుఁ డగుటఁ బ్రారంభవిద్య పూర్తికాఁగానె గారాముకొడుకును ఆంగ్లవిద్యాభ్యాసమునకై రేపల్లె కంపెను. రామకృష్ణుఁడు పదునేడవయేట ప్రవేశపరీక్షలో నుత్తీర్ణత గాంచెను. అందాఁకఁ బిలకజుట్టు పంచెకట్టులతోఁ దృష్టి గాంచుచున్న రామకృష్ణుని మనము కళాశాలలో నిపుడు కలియబోవుచున్నాము.



నూత్నయౌవనము, నూనూఁగుమీసలు, దబ్బపండువంటి మేనిచాయ, నల్లనిక్రాఫు, ఉలెనునూటు, ఈవినిఁగు హాటులతో ఎడింబరో విశ్వవిద్యాలయకళాశాలలో ప్రిన్సిపాల్ దొరయొద్ద సెలవు గైకొని స్వదేశమునకు రావలె నని రామకృష్ణుఁడు ౧౯౧౬ జూను నెలలో మూఁడున్నర గంటలవేళ నిలువఁబడియున్నాఁడు.

'రా-మ-క్రి-ష్-ణ' మఱచిపోయినాను; నీజనన మెప్పుడు?"

'౧౮౯౬ మార్చి నాల్గవతేదీని'

"నీగణితశాస్త్ర తిత్వశాస్త్రపాటవములకంటె రసాయన; భూగర్భశాస్త్రముల నేర్పు కూర్పు లాభదాయకము కాదా?"

"........................."

"భారతదేశము పర్వతమయము; సుందరవనశోభితము; జీవనదీనదవిరాజితము; వివిధఖనిజాచ్ఛాదితము. కావున నామాట విని

రసాయనభూగర్భశాస్త్రములఁ గూడ నభ్యసింపుము. నీభావిజీవితమున ఈవిద్యలు సుఖదాయకములును యశోదాయకములును గాఁగలవు”

“చిత్తము. తమ యాజ్ఞకు బద్ధుఁడను”

“ఆంగ్లదేశము వచ్చిన హైందవయువకులలో నీవు అదృష్టవంతుఁడవు కాఁగలవు. మూర్తి మంచిది. అన్నట్టు మఱచినాను. రా-మ-కృ-ష్-ణా! నీవు ఆంగ్లకన్యలతో ఆటపాటలకు వెళ్లవఁట ఏమి మాసంప్రదాయమునకు విరుద్ధముగా?”

‘మాసంప్రదాయమునకు విరుద్ధముగా నేనెట్టు నడచుకొనఁగలను? గురుదేవా! మీయీ దేశములో యువతీయువకులు పావనభావములతో ఆటపాటలతోఁ గలసి మెలసి యానందించుచుందురు. యువతీయువకుల దంపతులైనఁ దప్ప నితరులతో సహక్రీడలు సల్పుట భారతనీతికి విరుద్ధము”

“శెబాస్ రా-మ-కృ-ష్-ణా! స్త్రీవాగురలం జిక్క-క చక్కఁగాఁ జదువుకొని స్వదేశ మేఁగి సుఖ ముండుము”

“చిత్తము.”

* * * *

“ఏమిటయ్యా! వెంకటసుబ్బయ్యబావా! మీకృష్ణుఁడు యింకేం బియ్యేస్సి పాసై తురకచ్చేరా తురకవిద్య అన్నట్లు మోటారు సర్వీసు పెట్టాడు? ఇన్ని వేలు ఖర్చుచేసి ఇదా చేస్తుండాడు? ఉద్యోగం సెయ్యకపోతే—

“ఊఁ. ఊరుకోవయ్యా పంతులూ! మావాడి బరువు నువ్వే యెత్తుకుండావు.”

“మా బాపవాఁడైతే ఊరకొంటాఁడా?”

“మీకు అదే వృత్తి; ఏవాతికైన పరకైన తయా రౌతారు. మావాళ్ళు చిన్నజీతాలకు దర్జాలేని నౌకరీలకు ప్రాకులాడరు.”

“అయితేమాత్రము మోటారు సర్వీ సేమిటయ్యా? ఇంతకు మనవాఁడు ప్యాసయ్యాఁడా?”

“చాలు వూరుకోవయ్యా! పంతులూ! మీవాళ్లు నైజం పోనీయరు. అదే మీ వాడైతే వో తెగపొగడుతారు”

“కాగు బావా! వూళ్లో అంతా అట్టా అంటూ ఉండారు లే—నామాట కాదు”

“లోకానికి బుద్ధేమిటి? శుద్ధేమిటి?

“ఎవరయ్యా! రామకృష్ణగారూ! టెలిగ్రాం వొచ్చింది యెంకటసుబ్బయ్యగారి అబ్బాయిగారే నేంటి?”

“ఔను ఇట్టా తీసుకోని రావోయీ!”

“మీకిచ్చేది కాదు సుబ్బయ్యగారూ! వైస్రాయి వైరిది. మీ బాబుగారు సొయంగా తీసికోవాలి, మాకు సేనా బహుమానం వొస్తుంది.”

“అబ్బో! వైస్రాయి వయి రేమిటండి బావగారూ! ఏ ఎడిసన్ అండ్ కో వాళ్లదో, సింప్సన్ అండ్ కో వాళ్లదో మోటారుకార్ల తాలూకు”

“శుభం పలుకరా మంకెన్నా అంటే నీవెప్పుడూ యిట్టాగే మాట్టాడతా వేమిటయ్యా! కర్ణంగారూ!”

“పోనీ చూద్దాం గా బావా!”

“బావా లేదు గీవా లేదు. అట్టాపోయి అబ్బాయి మైనేనివారి పాలెంలో వుండాడు గుఱ్ఱానికి జీనేయించి తొరగా తీసుకోని రమ్మను”

“ఈ ఐ. సీ. యెస్. ఉద్యోగానికి గుఱ్ఱం కూడా యెందుకు మనిషి నంపరాదూ? ఏ సైకిలు మీఁదో వొస్తాఁడు. అత్తాయ అమాత్రమైనా సప్లయి సెయ్యరా!”

“ఎందుకయ్యా! యీసోది చెప్పిన పని చెయ్యించవయ్యా”

“కర్ణంగా రెల్లారు, అబ్బాయి వొస్తాఁడు కూర్చో పాపయ్యా! దాహం కావాలా?

“అక్కర్లేదు. బాబూ! అబ్బాయిగారి అత్తోరు ఎవరు బాబూ! ఎవరమ్మాయి నిచ్చారూ?”

“మైనేని రత్తయ్యగారి కూతురు సౌభాగ్యవతి; నిజంగా పాపయ్యా! వైస్రాయి వైరేనా?

“ఔనండి బాబూ నమ్మండి. మాపేష్టారు పాపయ్యా! వైరట్టుకెళ్లి తొరగా యియ్యి, దిట్టంగా బహుమానం వొస్తుంది. చాలా అదృష్టం వెంకటసుబ్బయ్యగారిది. అలాంటి కొడుకును కన్నారు”—అన్నారు. ఏంటిబాబూ! అంటే పనితొందరచే యివరంగా చెప్పలేదు. అబ్బాయిగారు వొస్తారుగా క్షణం ఆగండి బాబూ! అంతా తెలుస్తుంది. ఆవొచ్చేవా రవరు బాబూ!”

“కృష్ణా! ఎప్పుడొచ్చావు; నీకోసం గుఱ్ఱా న్నంపాను”

“మధ్యాహ్నమె వచ్చినానండి. శేషయ్యబావగారి యింట ఉన్నాను;

“సరే యేదో వైరొచ్చిం దట. వైస్రాయిదగ్గఱనుంచి, చూడు”

ఆశ్చర్యముతో నందుకున్నాఁడు రామకృష్ణుఁడు,

చదువుచుండఁగానె ముఖమున సంతోషము పొంగిపొంగి వచ్చుచున్నది. తండ్రితో

“నాన్నగారూ; నిజమేనండి వైస్రాయిదగ్గఱనుండియే టెలిగ్రాము వచ్చినది. నన్ను ఐ. సి. యెస్‌గా ‘బ్రభుత్వమువారు నిర్ణయించినారఁట.

తత్క్షణము సీమకుఁ (లండను) రావలసినదిగా అజ్ఞాపించినారు” అన్నాఁడు’

ఇఁకఁ జెప్పున దేమున్నది? వేంకటసుబ్బయ్య కనుక ఆయానందము నాపుకొన్నాఁడు, మఱొక డైనచో...కర్ణం సాంబయ్యను పిలువు మన్నాఁడు.

‘ఏమయ్యా! నియిల్లు బంగారంగాను నీవు వెళ్లాకోదానికి అన్నా మావాఁడు నిజంగా ఐ. సీ యెస్. అయ్యాఁడులే. నువ్వా యింగిలిపీసు యీడ్చావు గావును. అదుగో చదువుకో వైరు.

అబ్బాయీ! యియ్యరా పైరు;' అన్నాఁడు. సాంబయ్యాపంతులు అందుకొని చదివి తెల్లపోయినాఁడు. కొళ్లు వణఁక నారంభించినవి. అన్ని కబుర్లు చెప్పినవాఁడు రామకృష్ణుని ఎదుటఁగూర్చుండలేకపోయినాఁడు. రామకృష్ణుఁడు ఆయనను జూచి నవ్వుచు "సాంబయ్యగారూ! నేనింకను కలెక్టరుగా రాలేదు లెండు. మీకెందుకు భయము" అన్నాఁడు, వెంకటసుబ్బయ్య మునిమునినవ్వులు నవ్వుకొని టపాబంట్రోతునకు పదిరూపాయ లిచ్చి పంపించినాఁడు. మర్నాఁడు అన్నిపత్త్రికలలోను "వెలగపూఁడి రామకృష్ణుని సివిలుసర్వీసుశాఖలోఁ బ్రభుత్వమువారు నామినేటుచేసినారు" అని ప్రకటింపబడినది. ఆంధ్రదేశమం దల్లెడలను ఒక్కటేఁ మోఁత. ఆమర్నాఁడే బొంబాయి వెళ్లి రామకృష్ణుఁడు ఓడ నెక్కి లండనులో దిగినాఁడు పదునైదురోజులకే.

* * * *

రామకృష్ణుని లండను ప్రయాణమును గూర్చి యాంధ్రలోకమంతయు నానందాబ్ధి నోలలాడుచున్నది. తండ్రి వెంకటసుబ్బయ్య 'దత్తతండ్రి' లక్ష్మయ్య యానందమును గూర్చి చెప్పనేల? అన్నదమ్ములు అఁడుబిడ్డలు పొందు నానందమునకు మేర యేమి? అప్పటిలో లోకమే యానందమయ మైనప్పుడు వేఱె చెప్పున దేమి?

ఎందఱ కానంద మన్నను సౌభాగ్యవతికి మాత్రము పూజ్యము. ఆమెకు సృష్టి యంతయు అంధకారము; హారములు భారములైనవి. ఆహారము కారమైనది. వికారములు విస్తారములైనవి. సదాచారసంపన్న; సతీమతల్లి, భర్తయొక్క యున్నతదశ జోలి యామె కేల? తన సొగసుకాఁడు, తన ప్రాణనాయకుఁడు తన చెంగట లేనప్పుడు ఇతరసౌఖ్యములు ఆతల్లి కేల? అన్నియు వ్యజించినది. భర్తృమూర్తిని ధ్యానించుకొనుచు ఏకభుక్తము ఉపవాసములు ప్రారంభించినది. వియోగిని యగు కాంత కుండవలసిన లక్షణములన్నియు నామెయందు మూర్తీభవించినవి. ఈరీతిగా రెండేండ్లు గడచినవి. సౌభాగ్యవతి తండ్రివచ్చి "అమ్మాయీ! యింకను ఈకృశిం పేల? అల్లుఁడుగారు నేఁడో రేపో ఓడ దిగుతారు. ఇండియాకు నాల్గోవారుగాను మద్రాసురాజధానికి మొదటివారుగను ఐ. సి. యెస్ ప్యాసైనారఁటలే; సంతోషించు, బెంగెందుకు ఇంక, "ఇదిగో చూడు. ఆంధ్రపత్రిక" అని సౌభాగ్యవతి చేతి కిచ్చినాఁడు. సౌభాగ్యవతి కన్నులు విచ్చినవి. పత్రిక విప్పినది, నవమన్మథునివలె నవ్వుచుఁ దన్ను మోమున మోముపెట్టి పలుకరించినట్టు లున్న నాథుని పటమును గాంచినది. క్రింది వ్రాఁతను జదువుకొన్నది. కొండొక ఊఱట గన్నది. ౧౯౨౨ జనవరిని రామకృష్ణుఁడు స్వస్థానము చేరినాఁడు. ఎదురుకోలులు; ఊరేఁగింపులు, విందులు—ఓహో యేమి వేడుకలు! కాలుపెట్టినాఁడు అన్నమాటయే కాని స్వస్థానములో స్తిమితము లేదు. తీరిక లేదు. సౌభాగ్యవతి హృదయము చల్లఁబడునట్లు సంభాషించుకొనలేదు. ఇంతలో 'చెంగల్పట్'లో అసిస్టెంటు కలెక్టరుగా నియమింపఁబడినాఁడు ప్రభుత్వమువారిచే, సావకాశముగాఁ గాఁపురము పెట్టనెంచుచున్నాఁడు చెంగల్పట్టులో. భర్తృవియోగ దినములలోఁ జేసిన యుపవాసములకు ఫలితము సౌభాగ్యవతికి జీర్ణాజీర్ణము (Chronic dyspepsia) లోనికి దిగినది. భర్త యుద్యోగపుకీవిని జూచను లేదు. హృదయము హృదయములోఁ గలిపికొని ప్రణయరాజ్యమును ఏలను లేదు. ఆగష్టులో ఆకస్మికముగా అసువులను బాసినది. ఒక బాగులో ఒక ఓగు. రామకృష్ణుని జీవితములోఁ బ్రథమరంగము ముగిసినది.

## రామకృష్ణుఁడు—జయపురము

నిసర్గమగు ప్రకృతిశోభకు జయపురసంస్థానము ఆలవాలము. దర్దురంబులు మహోన్నతంబులు నగు పర్వతపజ్త్కులు, మలఁకలు మలఁకలై పాఱు సెలయేళ్లు సెలయేళ్లు, చెంగటఁ బొదరిండ్లలో గుఱకలిడు క్రోల్పులులు. సంతత వసంతసంపదంకురితంబులగు నానావిధతరులతాగుల్మములు. వృక్షచ్ఛాయల విశ్రమించుచుఁ బిల్లనగ్రోవుల నూఁదుకొను భిల్లయువకులు, వేణునాదంబులకు నాఱుపల్కు శకుంతసంతానము, ముక్కాఱు బండియుండు వివిధసస్యంబులు, రత్నగర్భంబులు, ఖనిజగర్భంబులు నగు క్షేత్రరాజంబులు గలిగి జయపురంబు ఇంబుమీఱుచుండును.

ఇట్టి జయపురంబును రాజధానిగాఁ జేసికొని యించుమించు పదునాల్గువేల చదరపుమైళ్ల వైశాల్యముగల మహాసామ్రాజ్యము నేలు రాజన్యులు, సూర్యవంశసంభవులు, అజన్మశుద్ధులు, అకుమారకన్యోద్గాతులు, భారద్వాజ సగోత్రులు నగు రామచంద్రదేవ మహారాజులుంగారు ఆయరణ్యక ప్రదేశమునకుఁ బ్రభుత్వాధికారి యగు మండలాధికారితోఁ గూడి యేమేమి యోజనలు చేసినాఁడో చెన్నరాజరాజధాని ప్రభుత్వమువారి కేమి సిఫార్సు చేయించుకొన్నాఁడో తెలియదు కాని ౧౯౨౪ నవంబరు నెలలో జయపురసంస్థానమున అమాత్యపదవి నలంకరించినాఁడు రామకృష్ణుఁడు.

రామకృష్ణుని దివానుగిరీతో జయపురసంస్థాన చరిత్రలో క్రొత్త ప్రకరణ మారంభ మైనది. అద్భుత మగు మార్పు పొడసూపినది. దుర్గమారణ్యములు సుగమారణ్యము లైనవి. శ్రమ మెఱుఁగని పాటు, సుఖ మెఱుఁగని దీక్ష. వేళకు భోజనము లేదు; భోజనములో రుచి యెఱుఁగఁడు. ఈరోజున ఏనుఁగుపై మలకనగిరి దండకావనములో; రేపు కారుపైని వాల్తేరు; ఎల్లుండి ఊటీ, ఆవలయెల్లుండి కలకత్తా బి. యన్. ఆర్ కంపెనీలో గోష్ఠి. ఇట్టి దినచర్యతోఁ గొట్టుమిట్టాడుచుండువాఁడు రామకృష్ణుఁడు. చూచువారికి అతివి, అమూర్తిమత్వము, అనుఱుకుఁదనము, ఆశ్చర్యమును ఆనందమును గల్గించెడివి. కాని 'స్కీము'లతోఁ గొట్టుకొను రామకృష్ణునకు సుఖమున్న యని యాంతరంగికులు అనుకొనెడువారు. భోజనసమయమున "పెరుఁగు తిన్నానుగా" కూర తిన్నానుగా. అని తినకయే లేచిపోయిన రోజులు చాల గలవు.

దుర్గాంబ అడుగుమళ్లవారి ఆఁడుపడుచు. అగర్భశ్రీమంతుఁడగు గోపాలకృష్ణయ్య కన్న కూఁతురు. తిక్కన భారతమునుగూడ నన్వయించుకోఁగల మాతృభాషాపాండిత్యము రామకృష్ణకరావలంబనమునకుఁ బూర్వమె నేర్చినదాకుమారి. కృష్ణకరావలంబనముతో నాంగ్లమున, హిందూపత్రిక ధారళముగాఁ జదువుకోఁగల శక్తియలవడిన దాముగ్ధాంగనకుఁ. జయపురావాసముచే ఉత్కలములో సత్కవిత్వము అవగతము చేసికోఁగలిగెను. ఆనాఁడు లేదు కాని యీనాఁడు ఆలవమునగూడ అనుభవము కలిగెను.

ఆనాఁటికి లోకానుభవము లేని మాతృశిక్షపూర్తిగా నెఱుఁగని పిచ్చితల్లి. ఆనాఁడు జయపురములో ఒక యిరుకటములు గల బంగాళాలో; కసరబాసర ఓఢ్రపు నౌకరులు; చుట్టును జీగురుమను చిట్టడవులు, కొండలు. ఆమె గుడివాడ—మద్రాసులు తప్ప నెఱుఁగని యమాయకురాలు. రామకృష్ణుని మందిరము నాఁటికి నేఁటికి యాతాయాతబంధు మిత్రజనంబులతో అన్నపూర్ణసత్రమును ధిక్కరించుచుండును. కార్యదీక్షాపరుఁడగు రామకృష్ణుఁడు అర్ధాంగలక్ష్మి దుర్గాంబతోడి యాలాపములతోపాటు జయపుర రాజ్యలక్ష్మితోడ సరాగముల నారంభించినాఁడు. రాజ్యాంగనాభివృద్ధిని గాంచి పొంగిపోవుచుండువాఁడు. గోదావరి ఇంద్రావతీ-నాగావళి యను నదులె వసనముగాఁ గలిగి పర్వతస్తనమండలి యగు జయపురరాజ్యకాంతయెడ నాతఁడు దక్షిణనాయకుఁడయ్యెను.

ఆర్యసంస్థానము లన్నింటితోపాటు జయపురసంస్థానములోఁ గూడ 'దసరాదర్బారులు' 'ప్రతియేఁట' దేవేంద్రవైభవముతో జరుగుచుండును. రామచంద్రదేవమహారాజా సాలగ్రామసింహాసనము పైని కొలువుదీరెను. ప్రక్కనే రామకృష్ణుఁడు తెల్లపాగాతో యాఘాగ్రేసరుని తీవితో మొలను బంగారు మలాము కత్తిమేలిరింగుల నీనుచుండ ఆసీనుఁడైనాఁడు. ఎదుట జ్యోతిషకులు, పండితకవులు చిత్రకారులు సహాయమంత్రులు ఉద్యోగులు పరివారము బారులుదీరి యుండెను. వారాంగనానృత్యములు వందిమాగధస్తోత్రములు గవిగాయకగానములు సక్రమముగా జరిగిపోయినవి.

మహారాజేంద్రుఁడు రామచంద్రదేవుఁడు తానుగా నిలుఁవఁబడి పేరలుంగులో

“అభివృద్ధి చేయుటకు అన్ని విధముల నవకాశము గల నాసామ్రాజ్యమును వృద్ధిచేయఁగల ఐ. సి. యస్ ను ఒసంగవలసినదిగా నేను మద్రాసు ప్రభుత్వమువారిని గోరినాను. నాకోరిక ననుసరించి వారు తమ రెవెన్యూ సెక్రటరీయు (సెక్రటరీ ఆక్టింగు; అండర్ సెక్రటరీ హాయము—ఇంత అనతికాలములో ఏ సివిలియను సెక్రటరీ కాలేదు) భూగర్భశాస్త్రనిపుణుఁడును నగు రామకృష్ణుని నాకు మంత్రిగా ననుగ్రహించిరి. వీరు వచ్చి యనతికాలమే యైనను నాసంస్థానము యొక్క యాదాయము ౧౪ లక్షలనుండి ౧౭ లక్షలవఱకుఁ బెంపొందించిరి. కళ్యాణసింగపురములో మాకును రైతులకును గల తగాయిదాలఁ దీర్చివేసిరి.

'మాడుగుల' జమీకూడ నాసంస్థానములోఁ గలిపి సామ్రాజ్యము విస్తీర్ణము చేసిరి. జయపురమునందు రంపపుఁగోఁతమఱయు (సామిల్లు) ఆరణ్యకవస్తుప్రదర్శనశాలయు, ఇప్పనూనె మఱియు, ఇప్పసారా మఱియు, అమాత్యసహాయామాత్యసౌధములను, 'బోరిగొమ్మ'—'కోట్పాడు' లలో బియ్యపుయంత్రములను, మాపట్టణమునకు విద్యుద్దీపములను, విశాఖపట్టణమున మాకుఁ బ్రాసాదమును గట్టించిరి. విజయనగరము—రాయపూరు రైలునుండి 'ఉమరుకోట'—నౌరంగపురము—కోటపాడు మోటు—క్షేత్రాచలము మీఁదుగా నిడదవోలికి ఒక అయోమార్గము నిర్మింపించుటకు విశేషకృషి సల్పఁబడెను. భూములు సర్వేచేయఁబడెను. అనతికాలములో రైలు రాఁగలదు. దానఁజేసి నాప్రజల యనాగరికత నశించుటయే గాక మా సంస్థానము నాదాయము కోటిరూపాయల దాఁకఁ బెరుఁగఁగలదు. తన భూగర్భశాస్త్రపరిశోధనకు ఫలితముగా మాసంస్థానమున 'అల్యూమి ఇనుము' గనులు కనుగొనెను. కోలాబ్—ఘగారా జలపాతములనుండి విద్యుత్తు నుత్పత్తిచేయించి మా సంస్థానమునంతకును 'సరఫరా' చేయు నూతనయంత్రములు స్థాపించుటకును—ఈవిద్యుత్తునే విశాఖపట్టణపు నౌకాశ్రయమునకు 'సప్లయి' చేయుటకును మా దివాన్ సాహేబు ప్రభుత్వముతో ఒడంబడిక కుదిర్చెను. ఈకార్యకలాపమంతయుఁ బూర్తి కాఁగానే మన సంస్థానము ఈమంత్రివర్యుని కాలములోనే రెండవ 'మైసూరు' కాఁగలదు.” అని నుడివి కాశ్మీరదేశపుఁ దళపాగయు, ఒక రత్నఖచితఖడ్గము, గడియారము రాజలాంఛనముగా రామకృష్ణుని కొసంగి మహారాజావారు సింహాసన మలంకరించినారు. పిమ్మట రామకృష్ణుఁడు కృతజ్ఞతాసూచకముగా లేచి వంగి నమస్కరించి—

“మహారాజావారి యనుజ్ఞపైని నేను వారు సెలవిచ్చిన సేవలతోపాటు 'డెల్టా'ప్రాంతపు వ్యవసాయము ఇచ్చటి రైతులకు నేర్పించుటకును సంస్థానాదాయము హెచ్చించుటకును నాపత్నికి గురువులు—నాకు మిత్రులు నగు సత్యనారాయణరాజు గారికి నూఱెకరముల భూమియు—నాకు అసిస్టెంటు దివానును ఆబాల్యమిత్రుఁడును నగు చెలికాని వెంకట్రావు బార్ ఎట్ లా గారికి సుమారు మూఁడువందల యెకరముల భూమియు జిరాయితీపట్టాగా నొసఁగుచున్నాను.' వీరు నాచేఁ బ్రచారమునకుఁ దేఁబడిన 'పిల్లిపెసర' కూడఁ బొలములో నెరువుగా వేసి చూపఁగలరు. అనఁగానే సభలో కరతాళధ్వనులు పెల్లుకేఁగెను.

### రామకృష్ణుఁడు—రామచంద్రదేవమహారాజా

'రామకృష్ణా! నూతన ఉత్కళరాష్ట్రములో మనరాజ్యము కలియకుండఁ జేయవలయును—మన జీవితములు ఈరాజ్యములో లీనము కావలయును—రాజ్యము విడినచో ఆంధ్రుఁడవగు నీమైత్రి నాకు దూరమగు నేమో!'

"మహారాజా! ఓడిసల్ కమిటీతో నేను మాట్లాడినాను. వారు ఈరాజ్యము ఒరిస్సాలో కలియరాదని 'రిపోర్టు' వ్రాసినారు. ఇదిగో చిత్తగించి సంతకము చేయుడు"

"ఓహో! దివాన్ సాహేబూ! మంచిది. మంచిది. జయపుర ములో పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఎల్లకాలము ఆంధ్రుడు ఉండునట్లు ఏర్పాటు చేయబడెనటగా?"

"చిత్తము తమ యనుగ్రహమున్నచో లోటేమి? ఈయేర్పాటు చేయక్క పోయినచో వాదము తీరదు. రైతులు చాలా సంస్థానముపైని ఫిర్యాదులు చేయరు. ఒడ్డెకరణాల పన్నులు అణగిపోవును."

'మంచిది. మనప్రయత్నము లేమైనవి.'

"ప్రభువువారి యాజ్ఞకు లోటుండునా? భారతప్రభుత్వమువారి యనుమతిని బొంది నేపాలమహారాజావారి దివాన్ సాహేబుబహద్దరువారిని కలకత్తాకు రప్పించినాను. ప్రత్యేక ప్రాసాదములో లక్ష రూప్యములు వ్యయముచేసి వారి సంప్రదాయానుసారముగా రాచ తీవులు మర్యాదలు నెఱపించినాను."

"పర్యవసానము?"

"పర్యవసానమున కేమి? ప్రభువువారికి నేపాలరాజన్యపుంగవుని తృతీయపుత్రికను ఇచ్చి పరిణయము చేయ ఒప్పించితిని. నిశ్చయ మైనది."

"నిజముగా!!!!"

"చిత్తము. వసంతోత్సవములతో పాటు శుభకార్యము..."

'సరే మంచిది. ఎస్టేటు అంతయు సర్వే ఎంతకాలములో పూర్తి యగును? ఖర్చు ఎంత? ఆదాయము యొక్క పెరుగు ఎంత?"

"మూడేండ్లకు పూర్తి యగును. వ్యయము లక్షరూపాయలు మాత్రమే. రాబడి కేవలము భూమిశిస్తుమీదనే నేడున్నదాని కంటె, నేడాదికి ఆఱులక్షలు వృద్ధికాగలదు."

"సరే మంచిది—అపు స్తక మేమిటి? తెలుగా?"

"చిత్తము—పత్రిక"

"ఎవరు వ్రాసిరి?"

"పండిత సత్యనారాయణరాజు......"

"ఓహో! కోట్టాడులో భూమిచ్చినాముగా?"

"చిత్తము—"

"దాని కృతజ్ఞత తెలుపుకొనుటకే నా కంకితము............ ......బాగున్నది. ఆంధ్రకవులు పోషించుటే మన ధర్మము. మా సంస్థాన మాదినుండియు ఆంధ్రులవల్లనే వృద్ధికాంచినది. కాంచు చున్నది."

"చిత్తము. అందుచేతనే కాదా ప్రభువువారు ఆంధ్రవిశ్వకళా పరిషత్తునకు రెండులక్షల రూప్యములు విరాళ మొసంగి ధాన్యులరు అయినారు?

"మంత్రుల మంత్రాంగముచేత—మంత్రులు ఆంధ్రులుగారా!"

* * * *

'బలరామపూరు' 'లక్నో' చెంత గల స్వతంత్రరాష్ట్రములలో నొక్కటి. దాని ఆదాయము ౭౫ లక్షల రూప్యములు. సూర్యవంశోద్భవులే దానికి అధినాయకులు; రామచంద్రదేవమహారాజా బలరామపురమహారాజా నల్లడు. మేలిమి బంగారము మాణిక్యము గలిసినవి. వన్నె కెక్కినవి. రామచంద్రుని వెన్నెట రామచంద్రుడే. కాని లాభ మేమి!

> ఎన్ని సిరు లున్న నేమగు నెంచిచూడ
> జీబరము కాదె బిడ్డలు లేని బ్రతుకు.

ఎన్నాళ్లకు గడుపు పండ పవికి మహారాజా చింతిల్లిన సఖుడు గానే మరల పవమము చేసికొన్నది మహారాజ్ఞి.

రాజాలు మహావల్లభులు గలిగియుందురను న్యాయము రామచంద్రదేవునిపట్ల సన్వయించకపోయినను ధర్మసూక్ష్మము నెంచి పరిణయమున కియ్యకొనెను. దివాన్ రామకృష్ణుడు దూరసంబంధము సంతానవతికమని నేపాలమహారాజతో వియ్యంబు నెఱప యత్నించెను. సర్వము సిద్ధమయ్యెను. ఈశ్వరాజ్ఞ బలీయ మగుటచే నది యాగిపోయినది. మహారాజ్ఞి మాట దాటలేక మహారాజా తుదకు మఱదలినే చేపట్ట నిరసించుకొనెను. ఇంటిలోని...వేమి.

సపరివారముగా బలరామపూరు వారి ప్రధానస్థాన మగు లక్నో చేరిరి. దివాన్ రామకృష్ణుడు మహారాజా ననుగమించియు రాచ కార్యముల తొందరచే మరలివచ్చి గుంటూరు ప్రాంతములో నున్నాడు.

ఆహా! భగవల్లీల!!!! క్షణము సంతసము, క్షణము దుఃఖము; తలంప నెవరి తరము? మనసుని ఊహలు యత్నములు మైన మను కురిసిపని వాడు యథ యధలు. చెల్లాచెదరలు కాకమానవు.

తొలుత యత్నించిన నేపాలసంబంధము కానందులకు యింత్సా హము మాలినాడు రామకృష్ణుడు. పైగా జ్యోతిష్కుల భిన్నాభి ప్రాయములకు డోలాయమానమను డైనాడు. ఇల్లాలిమాట దాటలేకపోయినాడు మహారాజా. కాని సంతానవంతుం డైనం జాలు ననుకొన్నాడు. కొండొకతృప్తి గొన్నాడు. ఒకమూలం బరిణయోత్సవయత్నములు జరుగుచుండగా ఒకమూల ఆరోగ్యమార్గ నిర్మాణయత్నములో మునిగి తేలుచున్నాడు రామకృష్ణుడు. ఇంతలో గుంటూరులో ఉండగానే—

"మహారాజా వెరీ సీరియస్. స్టార్టు ఇమిడీయట్లీ" దివాన్ ఆఫ్ జయపూర్" ఇంకేమున్నది!!! ఎన్ని డిగ్రీలున్న నేమి? ఎంత హోదా యున్న నేమి? జన్మ మెల్ల విశ్రాంతి యెఱుంగని తాపత్రయముతో డంటాలుపడు రామకృష్ణుడు పడుచు లేచుచు, లేచుచు పడుచు కారుమీద రైలుమీద కారుమీద అదికాదు ఇది, ఇది కాదు అది దగ్గఱ అను తహతహతో హుటాహుటీని వెళ్లి వ్రాలి నాడు లక్నోలో.

అప్పటికే శృతిమించి రాగమునఁ బడినది. దివానును జేరఁబిల్చినాఁడు. దగ్గఱకు. చేతిలోఁ జేయి వేసినాఁడు. ప్రయాగ ప్రయాగ... అన్నాఁడు మహారాజా. రామకృష్ణుఁడు కంటికి మంటికి ధారవదలినాఁడు. మరల ప్రయాగ...అనుచు మహారాజా రామకృష్ణుని పుడుకుచుఁ గనులు మూసినాఁడు. అంతయు గాఢాంధకారము. వేసిన చేయి జాఱినది.

ఇఁక రామకృష్ణుని యవస్థ యెవరు వర్ణింపఁగలరు? పిల్లను బాసిన తల్లివలెఁ దల్లిని బాసిన పిల్లవలె హాహాకారి! ఒకటే రోదనపు. పలవరింతలు. ఎంత చదువుకొన్న నేమి రామానుల కంటె ఘనుఁడా రామకృష్ణుఁడు?

పలవించి పలవించి మహారాజా చేయి రొంగుకో యెత్తినాఁడు మంత్రి. ఆ పేటిక్రిందనే యున్నవి తొంబది వేల మాటలు, అవి గాంచి పాతాళానికి దిగిపోయినాఁడు దివాను. సరి! 'స్నేహబైరము' సిద్ధమైనది. రామచంద్రుని భౌతికశరీరము, రామకృష్ణుని చైతన్యహీన మగు కాయము ప్రయాగలోని త్రివేణిసంగమము చెంతకు జేరినవి.

పగలు ౧౨ గంటలవేళ. ఇసుకలోఁ గాళ్ళు మాఁడిపోవు మన్నవి. పలుచని పైబట్టతో చందనపుఁ గాష్ఠము నెదుట నిలువఁబడినాఁడు రామకృష్ణుఁడు. హాహాయని విలపించుచున్నాఁడు. క్షణములో అగ్నిభట్టారకుఁడు ఆహుతిచేసినాఁడు కాష్ఠమును. పాంచభౌతిక మగు మహారాజు నవతారము పంచభూతములలోఁ గలిసిపోయెను. 'మహారాజా! రామచంద్రదేవా!' మీ తండ్రి విక్రమదేవవర్మవలెనే యిచ్చట లీనమైతివా? తండ్రీ కొడుకులు మరల నీయూలమునఁ గలిసికొన్నారా? నా ఋణము తీర్చి వెడలిపోయినావా? అన్నాఁడు, మూర్ఛించినాఁడు, గృహోన్ముఖుఁ డైనాఁడు రామకృష్ణుఁడు.

## రామకృష్ణుఁడు—నేను

౧౯౩౧ మేయి ౮ వ తేదిని ఉదయము ౮ గంటలకు నీళ్లు వేసిన జయపురపుకోట తలుపులు బ్రద్దలుకొట్టి తెఱచినారు. ఏమో సింగారించినారు. మధ్యాహ్నము ౧౨ గంటలకు వయోవృద్ధులు, భాషావృద్ధులు, అపరజనకులు, స్వర్గీయ రామచంద్రుని పితృవ్యులు నగు విక్రమదేవవర్మగారిని గద్దె నెక్కించినాఁడు రామకృష్ణుఁడు గద్గదకంఠముతో, అంతలో

"గోదావరీతీర—కేదారములు పోవ, నింద్రావతీభూము లిచ్చి మెచ్చి! కాశరపల్లిలో గల గృహాంబును వీడఁ, గోటపాటున ఇల్లు కూర్చఁ జేర్చి! స్వగ్రామమున నున్న—పసరంబు లవి పోవ, మలకనగిరి యొప్ప నిలిచి యొసఁగె! మనవి తెల్పిన యంత—చన విచ్చి రమ్మని, సకలాగ్రములు దీర్చి—సాకె వీకఁ! బ్రస్తుతము మీకు మంత్రియై—ప్రణుతికెక్కు— రామకృష్ణుఁడు నను దెల్పి రామచంద్రదేవునకును శ్రీవిక్రమదేవవర్మ!—యిది యీ నాఁటి సాకథ....

"యౌవనమంతయు న్జయపు-రాటవి పాలయిపోయె నందులో
నోవకు రామకృష్ణుఁడ! త-దూర్ధ్వపుఁ డైతివి రామచంద్రదే
వావని నేతకున్ గనుక-నాంధ్రము విశ్వకళావిరాళమున్
ఈవొనరింపఁజేసి ఋణ-మీఁగితి పొమ్మదె చాలు జన్మకున్"

అన్నాఁడు పండితరాజా. పద్యము వినీ వినకుండఁగనె చెంత దొర లున్నా రని యైన దలంపకుండఁ గనుల నీళ్లు గుక్కుకొన్నాఁడు రామకృష్ణుఁడు. దీర్ఘనిశ్వాసము పుచ్చినాఁడు. ప్రయాగక్షేత్రరంగము స్మరించుకొన్నాఁడు. దుఃఖ మాఁగినాఁడు. గద్గదస్వరముతో స్వర్గీయ శ్రీరామచంద్రదేవమహారాజులుం గారికిం గల యాంధ్రాభిమానము వారి పినతండ్రిగారును పుంభావసరస్వతులును నగు శ్రీవిక్రమదేవవర్మమహారాజులుంగారు కార్యరూపమునఁ జూపుటకై స్వర్గీయమహారాజా పేర నేఁటేఁట లక్షరూపాయలు ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు నొసంగఁగలరు. నేను చిత్రకారులకుఁ గవులకు జ్యోతిషకులకుఁ గావించిన వాగ్దానములు శ్రీవిక్రమదేవవర్మరాజావారు నెఱవేర్పఁగలరు. మా సత్యనారాయణరాజాగారిని శ్రీరాజావారు ప్రత్యేకాభిమానముతో నావలెఁ జూచెద రని నమ్ముచున్నాను." అన్నాడు.

అంతలో రామకృష్ణుని 'స్కీములు' కాలగర్భములోఁ గలిసిపోయినవి. పిమ్మటఁ గొన్నాళ్లకు-దివాన్ రామకృష్ణుఁడు డైరక్టరు రామకృష్ణుఁ డైనాడు—

"పసలి యుంటివి గదా! విజయదశములకు జయపురం బైదేండ్లు— సంతసమున
ఊరేఁగితివి గదా? యుత్సాహ మేపార శ్రీరామకృష్ణుని— చేయి పట్టి
అరగించితి గదా! యాప్యాయ మొప్పఁగా, నతిథిమందిరవస్తు— వితతి యెల్ల
వర్ణించితివి గదా! వహ్వారే యనఁ గవుల్, కాననసీమలోఁ గల హారంగు
నాటికిని నేఁడు నాల్గేండ్లు-దాటుచుండె
రసికుఁ డైనట్టి విక్రమ-రాజు గలుగఁ
'బలుపు' గట్టవు 'జయపూరు'-పయిన మనవు
కారణం బేమి తెల్పుమా కవివరేణ్యా!"

అని పరామర్శించుకొన్నాఁడు పండిత రాజా; ఇది వ్రాసి యనుపఁగాఁ జదువుకొని రామకృష్ణుఁడు మరల నొకమారు తన 'స్కీములు' జ్ఞప్తికి రాఁగా నివ్వెఱ చెందినాఁడు—నాఁటికి—నేఁటికి—రామకృష్ణుడు పండితరాజును పండితరాజా రామకృష్ణుని మఱవకుండ మైత్రినెఱపుకొనుచున్నారు.

# ఈర్ష్య

## చలంగారు

రాత్రి తొమ్మిదిగంటలు. వెంకువంతులు యిల్లు.

(హాలులో వెంకువంతులూ, భార్య రాధమ్మా, కొడుకు సుబ్బులూ వున్నారు. సుబ్బులికి నాలుగేళ్లు. ఆడుకుంటు న్నాడు.)

రా—చూడండి. వీడుపాట చెపుతాడు. సుబ్బా, యిట్లారారా.

సు—వుండు. యీగుఱ్ఱం సరిగ్గా వరిగెత్తటం లేదు. దీన్నికొట్టి, వొత్తాను.

రా—కాదురా. నాన్న పిలుస్తున్నారు. రా.

సు—వొత్తున్నా, గుఱ్ఱమెక్కివొత్తా. ఛల్, ఛల్ (కుర్చీమీదయెక్కి వొచ్చి నుంచున్నాడు.)

హాం, హాం, ఆగు. ఆగు. పెద్దగుఱ్ఱం. పోలీసుగుఱ్ఱం.

రా—చూడు, ఆపాటచెప్పు, నాన్న వింటారు.

సు—ఏపాట!

వెం—ఎన్నిపాట లొచ్చేం నీకు?

సు—చాలా వొచ్చు. ఏపాట?

రా—పొద్దున్న పాడలా, అదీ.

సు—వుండు. గుఱ్ఱం పోతోంది. హాం, హాం.

(చుట్టూ తిరుగుతున్నాడు)

రా—అరే, ఇట్లా రారా అంటే.

సు—మరికొంచెం వులవలిత్తావా గుఱ్ఱానికి? ఇత్తానంటే, ఆగుతుంది.

రా—ఇస్తాలే. రా.

సు—హాం, హాం, పాతపాలీ, వొత్తా వుండు, గుఱ్ఱం. నాన్నా పాలనా?

వెం—ఊఁ. కానీ.

సు—చెలగుమాచె, ఏమిచేతులా, ఆ, ఆ, ఆ.

చెలగుమాచె, ఏమిచేతులా.

ములిపెముగల, మొదతిలతిలో—

వెం—ఛీ, నోరుముయ్యి వెధవా.

(రాధమ్మ నవ్వుతోంది.)

సు—ఇందుకేనా, పాలమన్నాలు? వులవలియ్యి.

వెం—వులవలు కాదు, తన్నులియ్యాలి నీకు. పాడు పాటలన్నీ నేర్చుకుంటో.

నువ్వేనా నేర్పించింది?

సు—పాదు పాతలేంతి అమ్మా?

(శ్యామల వొచ్చింది. అనుమానంతో భయంతో వొచ్చింది. నిస్పృహ (Desperate) గా కనపడుతోంది. రాధమ్మ నివ్వెరపడి చూస్తోంది.)

శ్యా—ఏమే, రాధా, జ్ఞాపకం వున్నానా?

రా—(నిరుత్సాహంగా) ఎక్కడి నించి రావడం?

శ్యా—వట్లోంచి...అబ్బా! ఎంత సుఖంగా వున్నారో మీరు! ఎన్నేళ్లయింది నిన్నుచూసి? మీపిల్లాడా? మీ ఆయనా? ఏం అదృష్టం? అబ్బాయీ, యిట్లారా, నాయనా, నీపేరేమిటి?

రా—సుబ్బులు.

శ్యా—ఏమిటే, కూచోనన్నా కోచోమనవు? నేను రావడం యిష్టం లేనట్టుంది. అనుమానంతోనే వొచ్చాను. ఐతే పోతాను.

సు—వెళ్లొద్దు. అమ్మ పాత పాలుతుంది.

శ్యా—వెడతున్నానే.

(తిరిగింది.)

రా—ఎందుకు? నేనేమన్నాను?

శ్యా—నోటితో వేరే చెప్పించుకోవాలా?

రా—అదికాదే. ఏమిటో ఆకాశం లోంచి వూడిపడ్డట్టు వడితివి: ఆశ్చర్య పోయినాను. రా. కూచో. ఏమీ అనుకోకు.

(లేచి ఆమెని తీసుకొచ్చి కూచో పెట్టింది).

సు—వుందండి. ఇక్కడే ఖువ్వతినండి. లేప్పొద్దున్నే నాగుఱ్ఱం యిత్తాను. ఎక్కిపొంది. ఈవాల వులవలు పెత్తి, యిత్తాను. పెత్తకపోతే, యేలుత్తుంది. పా ఆపం.

శ్యా—నాబతుక్కి, గుఱ్ఱం కూడా యెక్కమన్నావా, బాబూ!

వెం—రాధా, యీమె యెవరో నాకు చెప్పావేకావు.

సు—పిన్ని, నాన్నా.

రా—నేను నాచిన్నప్పటి స్నేహితురాలు శ్యామల అని చెప్పలా? అదీ. చిన్నప్పుడే ముండమోసింది. చదువుకొని టీచరుపనిచేస్తో, వాడెవరో, ఆపాటకుడితో ఆ పని మానేసుకొని—

వెం—తెలిసింది.

శ్యా—(కన్నీళ్లతో) చివరికి నాగతియిట్లా అయింది. నిలవ నీడలేక అల్లాడిపోవలసి వొచ్చింది.

వెం—ఏమయింది ?

రా—ఏముందీ ? మామూలు కథే ! నాలుగురోజుల మోజు తీరగానే తరిమేసి వుంటాడు.

శ్యా—లేదు. ఆయన చచ్చిపోయినారు. నాకిప్పుడు ఆరునెలలు గర్భిణి—

రా—అట్లాగా, పాపం !

శ్యా—నాకోసం కాదు—తిండికోసం నాలోపల గిలగిలలాడే ఆయన పిల్లకోసం—శ్రీమంతుడి బిడ్డ—దౌర్భాగ్యురాల్ని నామూలాన, గుప్పెడన్నం కోసం, కొట్టుకోవలిసి వొచ్చింది. ఆపిల్లకోసం నేను ప్రాధేయపడుతున్నాను మీముందు. (ఏడుస్తూ) చద్దామనుకున్నాను. కాని ఆయనరూపం, ఆయన రసికత్వం, కంఠమార్దవం—అంతకీ, యీ పిండం వొక్కటే మిగిలిన చిహ్నం. దీన్ని నాశం చెయ్యడానికి చేతులు రాలేదు. గతేమిటి దేవుడా అనుకుంటో వుంటే, నువ్వు జ్ఞాపకం వొచ్చావు. తప్పకుండా ఆదరిస్తావని ఆశపడి వొచ్చాను.

రా—(శ్యామలని కావిలించుకుని) నేను వెనక్కి తగ్గుతానా ! మంచిపని చేశావు నాదగ్గిరికి రావడం—

సు—(శ్యామలని కావిలించుకొని) నీకు నాపత్తు చొక్కా కూలాయిత్తా...నాకుక్కపిల్ల కుయ్యిఅని తోక ఆలిత్తుంది.

రా—ఇది నీయిల్లనుకో. సుఖంగా వుండు. నీయిష్టం. ఎంతకాలమైనా వుండు.

శ్యా—నేను ప్రసవమయిందాకానే శరణమివ్వండి. చాలు.

సు—చాలునా ? ఇత్తాను. నీకు జీడిపప్పులు కూలా పెత్తాను.

శ్యా—ఐతే, నాట్రంకు బైటవుంది తెచ్చుకుంటాను.

సు—నేను తెత్తాను.

శ్యా—తీసుకొద్దాం, రా.

(శ్యామలా సుబ్బులూ బైటికి వెళ్లారు.)

రా—దాన్ని వుండ మనడం మీకయిష్టం కాదు కదా ?

వెం—పాపం, ఆపదలో వుంది.

రా—మీకిష్టమేనా అది చెప్పండి ?

వెం—నాకేం తెలుసు ! నీ స్నేహితురాలు.

రా—ఎప్పుడూ యింతే మీరు సంతోషంగా సరే ననలేరూ ?

వెం—ఎవరో కొత్తమనిషి. ఇంటో పెట్టుకుంటానంటావు. ఆమె చెప్పేదంతా నిజమేనా ?

రా—అన్నీ అనుమానాలే ? అదెప్పుడూ అబద్ధం చెప్పదు.

వెం—లేచిపోయిన మనిషి—

రా—చాల్లెండి పాపం; దాంతో సరిగా మాట్టాడండి. ఏమను కుంటుంది ? లేచిపోయిన మనిషంటారు, మీరుకూడా. ఏం చేస్తుందండీ, పసితనంలో మొగుడు పోయినమనిషి ! దానిదీ మానవజన్మమే కదా !

(శ్యామలా, సుబ్బులూ, ట్రంకూ పక్కచుట్టా తీసుకొచ్చారు)

సు—ఇక్కలపెత్తు...పెత్తెలో ఏమున్నాయి ? బొమ్మలా ? ఒక తిత్తావా ?

శ్యా—లేవు నాయనా ? నువ్వున్నావని తెలీదు. తెలిస్తే కొనుక్కొచ్చేదాన్ని.

(వొచ్చి కూచుంది.)

ఎంత అదృష్టవంతురాలివే, రాధా. ఎంత చక్కని కొడుకు.

రా—నా అదృష్టానికేం గాని. నువ్వూ ఎదో సంసారమూ అదీ సుఖంగా వుంటే నా కెంత సంతోషంగా వుండేది !

శ్యా—చిన్నప్పుడు, ఇద్దరమూ పెళ్లిచేసుకోకండా, దేశాలు తిరుగుదా మనుకున్నాము.

రా—కాషాయ గుడ్డలు కట్టుకుని, పాడుకుంటో—

శ్యా—(దిగులుగా నవ్వుతో) ఎంత సంతోషంగా వుండేవి ఆరోజులు—ఇట్లా అవుతా నను కున్నానా—

రా—పాపం, ఎంతగతి పట్టిందే నీకు? ఎట్లా గట్టెక్కను యీ చిక్కులు?

వెం—ఏమిటి? ఈకాన్పు కాగానే—ఆమె పొట్టా, ఆపావ పొట్టా పోసుకోలేదా? ఎందుకు, నాస్నేహితుల యిళ్లల్లో ట్యూషను లిప్పిస్తాను—

రా—సంగీతం ఎంత బాగా వొచ్చునని!

వెం—ఇంకేం?

రా—నిక్షేపమంటి వుద్యోగం ఎందుకు వొదులుకున్నావే?

శ్యా—మరి ఆయన అవ్వాళ్లో నాతో కూచుంటారా? ఆయన దేశాలు తిరిగి కచేరీలు చేయవలిసిన వారయ్యెను?

రా—దేశాలు తిరిగి కచేరీలు చేసుకోమను. నువ్వెందుకు?

శ్యా—నన్ను ప్రేమించా రాయన! మరి సీత సమస్తమూ వొదులుకుని రాముడివెంట పోలేదా? దమయంతి వెళ్లలేదా?

రా—సీతా దమయంతితో పోల్చుకో వలిసిందే—నమ్మి పోయినందుకు బాగా చేశాడుగా నిన్ను!

శ్యా—రాధా, ఆయన్నేమీ అనకు. నేను భరించలేను. ఆయన మహాత్ములు. ఒక్క రాగ మెత్తారంటే—పాటకచేరిలో కాదు—ఒక్కొక్క రాత్రి ఏమైదానంలోనో, వెన్నెల్లో కూచున్నప్పుడు, చంద్రుడు సముద్రపు కెరటాల్లో మునిగి పొయ్యేటప్పుడు, నాకోసం, ఆయన పాడారంటే—ఏంచెయ్యను, నాప్రాణాన్నంతా ఎట్లా ఆరాగంలో కలిపెయ్యను, ఆయన కేవిధంగా నేను ఆనంద మివ్వనని ఎంత పెనుగులాడేది నాఆత్మ. నీకర్థమవుతోందా? ఆయన మహాత్ములు—నావంటి వాళ్లు పదివేలమంది ఆయన కోసం ప్రాణాల్ని ధారపోసినా, ఒక్క లెక్కవకాదు. పంజాబులో ఢిల్లీలో, ఎటువంటి అంతఃపుర స్త్రీలు, ఆయనకి రహస్యంగా కబుర్లు పంపేవారో నీకు తెలిస్తేనా? హారాలు కవర్లల్లో పెట్టి కానుకలు పంపారు. అటువంటి రసికుడు, అవతారమూర్తి నావంక కన్నెత్తి చూశా రనేదే నాపూర్వజన్మ సుకృత విశేషం. ఆ తేజోమూర్తి, కళానిధి ఆత్మను నాగర్భాన ధరిస్తున్నాననే తలపే ప్రాణాన్ని నిలుపుతోంది. ఆయనే ఆకస్మికంగా, చనిపోక పోతే, నేను మహారాణీలను, చూసి ఐనా యీర్ష్య పడదునా? చివరికి నాదర్శనం కోసం ఎందరు కాచుకుని పడి వుండే వాళ్లు?

వెం—మరి, ఆయన చాలా సంపాయించి వుండాలి గదా. మరిమీకు ఏమీ మిగలకండా చేశాడేమి?

శ్యా—ఆయనకి జాతకాల్లో నమ్మకం. ఆనమ్మకమే ఆయన్ని చెరిచింది. ఆయనకేం? నన్ను చెరిచింది. తనకి డబ్భైయేళ్లు ఆయుర్దాయమనేవారు. ఎప్పుడునేను దిగులుపడ్డా, 'నీకెందుకు, శ్యామలా, నేనున్నానుగా, యింక ముప్పైఅయిదేళ్లు, నీకు ఏచింతాలేదు." అనేవారు. నమ్మాను, తెలివితక్కువదాన్ని. నాకోసం కాదు, ఈశిశువుకోసమన్నా నేను జాగ్రతపడవలిసింది. పిల్లలుంటారనే ఆలోచనన్నా వొచ్చిందానాకు వెర్రిదాన్ని;

వెం—ఆయనేం నిలవ చెయ్యలేదా?

శ్యా—చెయ్యకేం? ఎంతధనమో, ఆ బాంకి బుక్కులో? అంతా నాదేననుకున్నా. ఈ 'లా' నాకేం తెలును?' ఒక్కరవ్వ—ఆయన, మట్టుబొత్తాములు దాచుకునివుంటే, ఆయన రవ్వవుంగరం ఒక్కటి నావేలిన పెట్టుకునివుంటే—నాకీకష్టకాలం దాటిపోను. నాకేం తెలును! వొచ్చిపడ్డారు, ఆయనతమ్ములుట, అన్నేళ్లూ అయన్ని వెలివేసినవాళ్లు, అన్న చచ్చాడని చెప్పుకున్నవాళ్లు, ఆస్తికిమాత్రం వొచ్చిపడ్డారు. అన్నీ, ఆయనదగ్గిర నేను దాచుకున్న ఐదువందలతోసహా, తీసుకున్నారు. ఇదేం 'లా' ఓ, నాకు తెలీదు. ఆయన, బిడ్డని అనాథనిచేసి—తమ్ముల కిప్పించింది. ఏమిన్యాయమో!

వెం—కోర్టుకి వెడితే కొంత యిప్పిస్తారను కుంటాను.

శ్యా—అదొకటే మిగిలింది, యీబతుక్కి.

రా—పిచ్చిదానివి. ముందే జాగ్రత్తపడి డబ్బంతా నీపేరులో వేసుకోవలిసింది. అప్పుడూ యింతే—పెనిమిటి ఆస్తినంతా పుట్టింటో వొదిలిపెట్టి వొచ్చావు.

శ్యా—కాని ఆ ఆనందంలో ముందూ వెనకా చింత లే లేవునాకు.

రా—ఆనందం ? ఆనందమేమిటి ? పాడు ఆనందం ? నీమొహం ఆనందం లాగేవుంది. ఏమిటే ఆ ఆనందం ?

శ్యా—ప్రేమించిన ఆనందం.

రా—అంటే ?

శ్యా—ఎట్లా చెప్పను ? నీ భర్తనీ, బిడ్డనీ ప్రేమిస్తే, ఆనందం రావటం లేదూ నీకు ?

రా—వొస్తే ? వొళ్లు తెలీకండా పోతుందా నాకు? ఆయన యిన్ను రెన్ను ఎవరికోసం కడుతున్నారో అడుగు. నాతో నరిపోల్చు కుంటున్నావు? అందులో—అట్లాంటి నంబంధంలో—ఆనందమేమిటే, నీమొహం ?

శ్యా—(శ్యామల ధ్యాన భూతకాలం వేపు తిరిగింది. తలుచుకొని మాట్లాడుతో మైమరుస్తోంది.)

శ్యా—నీకు తెలీదు. నువ్వు పొందే ప్రేమ, ఎట్లాగో ఏమంత్రం వల్లనో పెళ్ళ్యిరెట్లు అధికమయిందనుకో. కాదులే. ఆ ఆనందమే వేరు—ఇట్లాకాదు, అనలు. నీకు యిప్పుడు పదిలక్షల రూపాయలు లాటరీలో వొచ్చాయి అనకో—చీరె చిరిగిన నంగతిగాని, రేపు పొద్దున్న ఏం కూర వొండుదామని గాని, యోచించగలరా ? పెద్ద సూర్యుడు అనేకరంగులతో నీముందు వెలుగుతో వుంటే, ఇంకేమన్నా నీకళ్లకి కనబడుతుందా? అట్లానూ—ఎంత ప్రేమించాను ? ప్రతినిమిషమూ ; ప్రతి రక్తబిందువునీ, ఆయనలో లీనం చేశాను. ఎన్ని దేశాలు తిరిగాము ? ఆగ్రా, కాశ్మీరము, కలకత్తా, డార్జిలింగ్, మధుర, మైసూరు—వెన్నెలలో సముద్రపువొడ్డున యిసికలో, హిమాలయాల్లో సూర్యుడుదయించేప్పుడు, నానిటాల్ సరస్సులో, కాశ్మీరపునదుల్లో, టాజ్‌మహాల్ ముందు, ఆతను నాపక్కన అనుకుని, నానడుం మీద చెయ్యేసి, నాకళ్లలో అతనినవ్వు, నా అందాన్ని అతని ఆరాధన—పెద్దనభలు—పువ్వులు, ఆహ్వానాలు, ధనము, కీర్తి, ఎట్లా చెప్పను ? నన్ను నీచంగా చూశారా ప్రజలు—నేనొక్క పలుకు పలికితే మహాభాగ్యంగా పలకరించేవారు. అట్లాంటిలోకం వుంటుందని, అంత అందం, సౌఖ్యం, అత్తరులు, చీరెలు—వుంటాయని కూడా తెలీదు నాకు—కలలో కూడా. ఎట్లా తెలపను నా ఆనందం ! ఈపిచ్చి, దరిద్ర జీవితాల్ని, యీక్షుద్ర, సాధారణ సంసారాలని, పిచికల్లాగు గూళ్లల్లో చిన్న దీపాలు పెట్టుకుని, పచ్చళ్లు నాక్కున్నే దంపతుల్నీ చూస్తే, నాకెంత దిగులేస్తుంది ? (పెద్దనిట్టూర్పువిడిచి కళ్లు తెరిచింది.)

అందుకనే నాకు బతుకుమీద ఆశలేదు—సుఖంగా సంసారాలు చేశేవాళ్లని చూస్తే యీర్ష్యలేదు. నాశరీరానికి ఉపయోగం గడిచిపోయింది—యీశిశువుని కనడం కోసమే నిలిచివుంది.

నాచేతుల్ని, నాకాలి వొంపుని, నా మొహం మీద పడే జుట్టుని, నన్ను నిలువునా, నా అందాన్ని (మొగవాడున్నాడని జ్ఞాపకం తెచ్చుకుని చప్పన ఆపింది.)

పూజించి ఆరాధించే కవి పోయింతరవాత—నాకెందుకీ జీవితం ?

వెం—ఎందు కట్లా అంటారు ? మళ్లీ పెళ్లి చేను—

శ్యా—నాకా ? ఆయనతో నేనూ కాలిపోయినాను. నాకింక మొగాళ్లూ లేరు, లోకమూ లేదు.

సు—అమ్మా, నిద్రవొస్తోంది.

రా—పడుకో. వెళ్లు.

సు—నాకు భయం.

శ్యా—బాబూ, రా. పడుకో పెడతాను.

నేనుకూడా పడుకుంటానే.

రా—అక్కడే, బాబు పక్కనే పడుకో. తివాసీ వుంది. పక్కపరుచుకో.

సు—ఇప్పుడు అమ్మకీ, నాన్నకీ, చెప్పలా—అత్తాంటి మంచికథ చెప్పా. నేను, పెద్దవి—అవ్వాల్లు—మదులా—ఇంకా—ఇంకా—అన్ని పోతా.

(శ్యామలా, సుబ్బులూ వెళ్లారు. కొంచెం సేపు మాటల్లేవు.)

రా—(మెల్లిగా) దీన్ని పంపించేద్దాం. ఇది మన యింటో వొద్దు.

వెం—ఇదేమిటి? ఇంతాకణ్ణించి వుండమని బతిమాలి, వాగ్దత్తం చేసి నమ్మించి,—ఎట్లా పొమ్మంటావు? ఎందుకు?

శ్యా—అవును లెండి. కాని...మరీ...యింతదుర్మార్గురాలని తెలీలేదు.

వెం—ఇప్పుడేం కొత్తగా దుర్మార్గురాలని తెలిసింది?

రా—ఎదో పాపం చేస్తే, భయపడి, నీచంగా, బాధగా బతికితే కనికరించవొచ్చు. కాని దుర్మార్గంలో యింత సుఖం—సరిగా కష్టపడి సంసారాలుచేసి, బాధలుపడే మాకన్న సుఖమనుభవిస్తే—ఎంతదుర్మార్గురాలై వుండాలి? ఎంతో రాక్షసురాలైతే తప్ప, అంత పాపంలో, అంత ఆనందపడలేరు.

వెం—మరి ఆనందం లేకపోతే పాపంలోకి ఎందుకు దిగుతారను కున్నావు?

రా—ఇట్లాంటి ఆనందమా? ఎదో ఆగలేక, యీ పాడు శరీరం కోసం, పాపంచేసినా, అంతరాత్మ అంత సేపూ బాధిస్తోవుంటుం దని—ప్రతినిమిషమూ పశ్చాత్తాపంతో యేడుస్తో వుంటారనీ అనుకున్నాను. కాని దానికి సిగ్గులేదు. చూడండి. పశ్చాత్తాపమే లేదు. పాపభీతి లేదు. దైవభక్తిలేదు. నరకంలో కాలుస్తోవుంటే అప్పుడు తెలుస్తుంది యీఆనందమేమిటో—ఇన్నాళ్లు, డబ్బుదాచి, దాచి, సంసారం చేసినా, ఒక్క మెడ్రాసు తప్ప చూడలేకపోతిమి? అది ఒక్కదెబ్బని లోకమంతా చుట్టింది. అందులో మర్యాద, కీర్తి—ఇది వాడిభార్యే అనుకున్నారుగావున. ఎవరన్నా అసలు సంగతి చెప్పవలిసింది. అయ్యోది అమ్మగారివని—

వెం—ఒకవేళ నరకం లేదనుకో. వున్నా నరకానికి పోదనుకో.

రా—ఎందుకు పోదు? తప్పకండా పోతుంది.

వెం—మరి కాశీ, గయా, తిరిగింది కదా—

రా—ఐతే మాత్రం? అటు తరవాతా చేసివుంటుంది. కాని అది యిక్కడ వుండడానికి వీల్లేదు.

వెం—(ఆలోచనతో) ఇదే గావును కారణం, పాపం చేసిన స్త్రీలను చూస్తే, యీ సంసార స్త్రీలకు అంత కోపం కలగడానికి.

రా—ఏమి?

వెం—యీర్ష్య.

(తెర

---

# హాస్యరసము

### జమ్ములమడక మాధవరామశర్మగారు

“రస్యతే ఆస్వాద్యతే ఇతిరసః” అని రసవ్యుత్పత్తిని నిర్ణయించారు. అపరిమితము అఖండముఅయిన స్వీయాస్వాదమే రసము. ‘ఆస్వాదింపబడునది రసవాచ్యమగును’ అను నిర్వచనములోని వ్యుత్పత్తి ఔపచారిక మని పెద్దలంగీకరించినారు. రసము లన్నిటిలోని ఆనంద మేకరూపమే. అయినా అంతరంగధర్మముల భిన్న భిన్న రీతులను బట్టి రసములను తొమ్మిదిగా పరిగణించి సిద్ధాంతించినారు. రసములు తొమ్మిదే అనటం సరసమైన వాదము. ఒకటి, ఎనిమిది, పది. పదకొండు అనే వాదాలు యుక్తిసహములు కావు. ఈ విషయతత్వము నా నవరసరహస్యములో స్పష్టముగా ఉన్నది.

సృష్టిలోని సంఘటనావిశేషాలు నిరంతరంగాంతరంగానికి చలనము సంపాదన చేసి భిన్న రీతులలో భిన్నస్థాయులను చేకూర్చుతవి. ప్రపంచవ్యవహారా అన్ని ఇంద్రియతృప్తికి సమర్థములు. వీనిలో అద్వితీయానందము దూరదూరముగా ఉంటుంది. ఒకే పదార్థము సర్వేంద్రియతృప్తి నివ్వలేదు. చాక్షుష మైన తృప్తి పూర్ణంగా ఉన్నా మనస్సు సంకల్పవికల్పరహితం కాదు. అన్ని యింద్రియములూ ఒక పర్యాయం తృప్తములు కావటం దుర్ఘటం. ఇంద్రియ సముదాయం సమకాలంలో తృప్త మయినప్పుడు మనస్సు నిత్యతృప్తావస్థను పొందుతుంది. మనస్సుకు కలిగిన ఈఅవస్థలో ‘సత్వోద్రేకప్రకాశానందమయ సంవిద్విశ్రాంతి’ సులభ మవుతుంది, మనస్సులో ఇట్లాంటి పరిణామమును బాహిరపదార్థాలు సంపాదించలేవు.

కావ్యసృష్టి విజాతీయము. ఈసృష్టి సిద్ధపదార్థముల నాధారం చేసుకోరాదు. ఇతరవ్యాపారసాధ్యవస్తువు లిందులో పనికిరావు.

ఇందులో బొద్ధతత్వం పుష్కలత్వాన్ని సంపాదించుతుంది. అతీంద్రియమార్గంలో ఇది వెలువడి వ్యక్తమై ప్రకాశించుతుంది. కావ్యభావనలో అమేయపదార్థం స్ఫుట మవుతుంది. పరిపక్వబుద్ధు లయిన సహృదయులు దీనిని భావనచేయగలుగుతారు. ఇందులో ఇంద్రియముల అవసరం లేదు. సర్వేంద్రియతృప్తిలో గలుగు నిత్యతృప్తావస్థను మనస్సున కీభావన కూర్చుతుంది. నిస్తబ్ధమైన యిప్పటి మనస్సు 'అఖండాద్వితీయ నిర్భరస్వాత్మానందమూర్తి'తో వెలుగుతుంది.

విభావాదిసంసృష్టమైన కావ్యార్థమే విలసనం పొందుతుంది. కావ్యార్థసంభేదము కలిగినప్పుడు సామాజికుని మనస్సులో 'ప్రత్యస్తమితస్వపరవిభాగము' గలిగిన 'ప్రబలతరస్వానందోద్భూతి, ప్రకాశించుతుంది.

విభావాదులలో ఉన్న భేదము భిన్నభిన్నచిత్తభూములను సంపాదించి స్వాదభేదహేతు వవుతుంది, అంతర్వ్యాప్తివికాసాత్మక మయినప్పు డప్పటి స్వాదము శృంగారవాచ్యము హాస్యవాచ్యము కాగలుగుతుంది.

సత్వరజస్తమోగుణముల పరస్పరసంబంధవిశేషము అంతఃకరణధర్మములలో విశేషమును సంపాదించుటకు సమర్థము. గుణముల సంబంధభేదము నవత్వమును సంపాదించుకొనగలుగుతుంది. రాజససాత్వికమైన అంతఃప్రవృత్తి వికసనం పొంది హాస్యానుకూలం కాగలిగినప్పుడు స్వప్నజాగ్రదవస్థాసాదృశ్యం వ్యక్తమగును.

హృదయస్థానములోని అష్టదళపద్మమునందు జీవసంచారవిశేషము అంతఃకరణములో గలుగు భిన్నభిన్నభావములకు హేతువు. పశ్చిమదళవిశ్రాంతిలో గలుగు క్రీడావినోదముల మతివిలసనము హాస్యోత్పాదకత్వమును వహింపగలుగుతుంది. మనోవృత్తిలో రాజసధర్మం స్ఫురించటానికి బాహిరపదార్థములు సహకారిత్వమును పొంది ఆనుకూల్యమును సంపాదించుతవి. రాజసమనఃప్రవృత్తిలో తీవ్రత, ఉద్వేగం, అనాలోచన మొదలయిన కలుషధర్మాలు అవకాశమును కలుగజేసికొంటవి. అధర్మములలోని సూక్ష్మతత్వం హృదయానుభావ్య మయినపుడు సుఖప్రదత్వం స్ఫుట మవుతుంది. ఆనందాంశ స్ఫురణము వెంటనే సాత్వికకలనము అపరిహార్యము. రజోమిశ్రితమైన సత్వప్రవృత్తి అంతఃకరణవికాసము నివ్వగలుగుతుంది. ఈవికాసవృత్తిలో వినోదబుద్ధి గలిగినపుడు హాస ముద్భూత మవుతుంది. అంతఃకరణములో వికాసవిధానమును సంపాదన చేసే రాజసచలనము కలిగిన మానసక్రియకు వికృతాలంకార-వేష-భాషా-చారములు ఉద్దీపనములు. దేశకాలములను అనుసరించిన విపరీతవేషములలోని వికారపద్ధతి, వయఃపరిణామములలో గలిగే అవస్థావిశేషములలో ఉన్న అనుకరణములు, వర్గవిధులను బట్టిన వక్రవిధులు ఉద్దీపనకోటిలో చేరుతవి.

వాని వాని హేతువులను అనుసరించిన హాసము ఆత్మసంస్థము, పరస్థము కావచ్చునని పెద్ద లన్నారు. ఈహాసము సంక్రమణస్వభావము కలది. హృదయబలం కలిగి గాంభీర్యముతో ప్రకాశించే ఉత్తమపురుషుడు విభావసామగ్రితో కూడుకొన్నప్పటికీ అనుభావప్రదర్శనం చేయడు; కాబట్టి హాసస్ఫూర్తి కనపడదు. అయినా కొంత దుర్బలహృదయులు ఆత్మసంస్థమైన హాసవివశులై ఉన్నప్పుడు ఉదాత్తహృదయులు కూడ హసించటం ప్రసిద్ధమే. ఈఅనుభవాన్ని బట్టి హాసానికి సంక్రాంతిగుణం ఉన్న దని అంగీకరింపవచ్చు. పుల్లని పదార్థమును అనుభవించి ఆస్వాదించేవాళ్లకు చొంగ మాదిరి నోరూరుతూ ఉంటుంది. అట్లాంటి వాళ్ల సన్నిధానంలో ఉండి ఆపదార్థాలను అనుభవించకపోయినా అమితంగా దంతరసం (ఊట) పొందేవాళ్లున్నారు.

ఈఉదాహరణం హాసానికి ఉన్న సంక్రమణమును స్పష్టం చేయవచ్చు. ఒక హాసానికే గాని శోకాదులకు సంక్రమణస్వభావం లేదని ఆలంకారికుల నిశ్చయం. అంతర్ముఖముగా అంతఃకరణవృత్తుల పరిణామపద్ధతిని పర్యాలోచనచేయగా హాసోత్పత్తి పైవిధముగా ఉంటుం దని మానిశ్చయం. అంతర్ధర్మాలకు బహిస్సంఘటనలకు సామరస్యం ఉన్నపుడు కార్యకారిత్వం ఉంటుంది. హాసములో ఆలంబనోద్దీపనవిభావసామగ్రి విపరీతముగా, వికటముగా, వివిధముగా ఉండాలి. వానిలో న్యూనత్వం అవశ్యంగా ఉండాలి. ప్రకృతోపయోగమును గలగజేసే సుగుణము లుండగూడదు. యథావిధానపద్ధతిలో ఉంటే అది అనుకూలవిభావం కాలేదు. అననుగుణమార్గంలో అనవసరస్వరూపాదికముతో అనుచితముగా హాసవిభావాలుండాలి. ఇట్లాంటి తత్వాలతో ఉన్నపుడే అది హాసవిభావము. విభావముతో కూడుకొన్నపుడు అనుభవితలకు అనుభావములు ప్రకృత్యనురూపముగా కలుగుతవి. ఉత్తమమధ్యమాధమప్రకృతులలో స్మిత, విహసితా, పహసితరూపముగా హాసము వెలువడుతుంది. ఈస్మితాదులతో ఉన్న హాసము, ఆత్మసంస్థము. దీనికి ఉత్తమమధ్యమాధమప్రకృతు లందు సంక్రమణము కలిగినపుడు పరసంస్థము అని వ్యపదేశించాలి ఉత్తమప్రకృతిలోని స్మితము ఉత్తమప్రకృతిలో సంక్రమించితే హసిత మవుతుంది. ఇట్లాగే విహసితాపహసితముల సమానప్రకృతిసంక్రమణము ఉపహసితాతిహసితవ్యపదేశం పొందుతుంది.

ఈ హాసము సామాన్యదృష్టిలో పైవిధముగా ఆరువిధము లవుతుం దన్నారు. విశేషరూపంగా విచారించితే మన గణనలోనికి ఇంకా భేదాలు వస్తవి. స్మితాదులకు సమానప్రకృతిసంక్రమణమే కాక అసమానప్రకృతిసంబంధం అంగీకరించినప్పుడు ఇంకా భేదాలు రావచ్చు. ఈ ఉత్తమాదిభేదమే కాక జ్యేష్ఠకనిష్ఠ—వాత, పిత్త—మందచండాదిభేదం. ఇంకా అట్లాంటి భేదాలు చూస్తే లెక్కతక్కువ కాదు. ఆత్మసంస్థమైన హాసములో కూడ వికృతవేషభాషాదులే విభావములు.

ఇట్టి హాసము స్వోచితవిభావానుభావవ్యభిచారిసముల్లాసితమైనప్పుడు హాస్యరసవ్యపదేశమును పొందుతుంది. హాస్యరసమును ఆలంకారికులు గూడా ప్రధానంగా ప్రతిపాదనము చేయలేదు. కవుల దృష్టిలో కూడ దీనికి ప్రాధాన్యం లేదనవచ్చు. సంస్కృతగ్రంథాలలో గాని ఆంధ్రప్రబంధాలలో గాని హాస్యం మూపపాదం

కాలేదు. ప్రాచీను లందరూ అవసరమును బట్టి హాస్యమును నిరూపించారు. దీనికి ప్రత్యేకత్వం ఇవ్వవలె నని వారు తలచలేదు. కావ్యమార్గంలో సాధారణంగా హాస్యం అంగిరస మయినట్లు కన్పడదు...ప్రహసన మనే రూపకభేదంలో హాస్యము ప్రధాన ప్రతిపాద్యము కావలయు నని అదే అంగిరసము కావలయు నని ఆలంకారికులు నిశ్చయించారు. ఈప్రహసనము శుద్ధము సంకీర్ణము అని రెండువిధము లన్నారు. * భగవత్తాపసవిప్రై రన్యై రపి హాసవాద సంబద్ధం। కాపురుషసంయుక్తం పరిహాసాభాషణప్రాయం। అధికృతిభాషాచారం విశేషభావోపపన్నచరిత మిదం। నియతగతివస్తువిషయం" గా ఉన్నప్పుడు శుద్ధప్రహసనము "వేశ్యాచేటనపుంసకవిటధూర్తా బంధకీ చ యత్ర స్యుః। అనియతవేషపరిచ్ఛదచేష్టితకరణం" గా రచించితే సంకీర్ణప్రహసనం. ఈలక్షణాలతో కూడు కొన్న రూపకాలు సంస్కృతవాఙ్మయంలో కొన్ని ఉన్నవి...... లంబోదరప్రహసనం మన ఆంధ్రదేశంలో బహుళప్రచారం పొందింది. విజయనగరం హామిక్ హాస్టలులో లంబోదరప్రహసనంలోని కొన్ని ఘట్టా లుపపాదించి చెప్పినప్పుడు అక్కడి విద్యార్థులు నన్ను బాగా మెచ్చుకొన్నారు. పతితపావనాష్టకం వాళ్లకు రుచించలేదు. భవభూతిపద్యాలు బూడిదగుమ్మడికాయలు మాదిరి ఉన్నవిట. ఉదాత్తభావంతో ఉన్న ఉత్తమకవిత్వం వాళ్లకు అప్పుడు ఏవగింపు కలగజేసింది. సంస్కృతభాషాభ్యసనం చేసినవాళ్లు బూతుపద్యాలు వినిపించినప్పుడే మెప్పుపొందుతారు కాబోలు.

ఈలంబోదర ప్రహసనాన్ని మనవాళ్లు మహాకవి కాళిదాసుకు అంటగట్టారు. లటకమేలక ప్రహసనం అంతగా మనలో ప్రచలితం కాలేదు. కలకత్తాలో ముద్రిత మయిన హాస్యార్ణవప్రహసనం ఉన్నట్లు మనవాళ్లకు సామాన్యంగా తెలియ దనుకొంటాను. అందులో చక్కని పచ్చిబూతు లున్నవి. సురతమును మహాయాగంతో పోల్చి కవి వర్ణించాడు. నారాయణ!!! ఆవర్ణన చాలా ఏవగింపు కలిగించింది. స్రుక్కు. స్రువం, హవిస్సు, హోమకుండం మొదలయిన నిఖిలయాగద్రవ్యములకూ సదృశపదార్థాలను కవి నిరూపించాడు, అబ్బా!! ఇట్లాగే హాస్యం ఉంటే "నమోవాకం ప్రశాస్మహే"

మృదు వైన హాస్యం అంగిగా ఉన్నట్లు కన్పడదు. హాస్యం ఏవిధంగా ఉన్నా విభావసామగ్రి పైన చెప్పినట్లు ఉండకతప్పదు.

ప్రాచీనప్రబంధకారులు హాస్యమును నిరాదరణగా చూచారంటే వాళ్లకు న్యూనత లేదు. ప్రతిపాద్యాంశము ఆదర్శప్రాయముగా ఉండవలె ననే మహాసంకల్పం ప్రాచీనహృదయాలలో నిబిడీకృత మయింది. సత్పురుషకథానిబంధనమే అవసర మని, కర్తవ్య మని, ప్రవర్తక మని, ప్రాచీనులు తలచారు. గుణనిరూపణం వలన దోషసముదాయం ఉన్మేయము కావలె నని వాళ్ల సదభిప్రాయం. దోషోద్ఘోషణము అనుచిత మని నిశ్చయించి ఉంటారు.

కావ్యసృష్టికి ఆనందమే పరమప్రయోజన మని తలచిన ప్రాచీనుల రచనామార్గం మన కందరకూ శ్లాఘనీయ మన్నప్పుడు "కలుషకేముషీకత్వం నావిష్కరణీయం." రచనావిధానం ఆనందపర్యవసానం పొందినప్పుడు ప్రవృత్తిలో ప్రేరణ ప్రతిధ్వనించుతుంది. ఆ ప్రేరణకు అనుకరణంగా కలిగిన ప్రవృత్తిసంతానంఅపరిహార్యముగా అంతరంగములో ప్రతిబింబనము పొందుతుంది. దానిని లోకం ఆదర్శప్రాయముగా నిశ్చయించు కొనకమానదు. అది ప్రధానావలంబనము.

ఉత్తమచరిత్రప్రతిపాదన మున్న కావ్యము ఉత్తేజక మవుతుంది. అట్లాంటిది లోకములో సత్ప్రవర్తనమును సంపాదింపగలుగుతుంది. సూక్ష్మముగా అంతర్ముఖత్వముతో ఆలోచించినప్పుడు, నీచకథావిధానము ఇంతకు నిశ్చయముగా విపరీతము, అను నిర్ణయము మనకు కలుగకమానదు. కావ్యమువలన కర్తవ్యోపదేశమును సంపాదింపదలచిన ప్రాచీనులు ఉదాత్తోత్తమచరిత్రమును ఆధారముగా స్వీకరించారు, "కర్తవ్యమును బోధించు కావ్యపద్ధతి, భావ్యమానమై హృదయానుస్యూత మయినప్పుడు ఆకర్తవ్యమును స్పష్టము చేయగలుగుతుంది." అనే నిగూఢతత్వమును ప్రాచీనులు బాగా ఉపాసించారు. మనసత్కావ్యప్రపంచము వారి ఉపాసనాఫలము. మన రసోన్ముఖానన్యభావన వారి ఉపదేశసారము.

పాశ్చాత్యదృష్టి పరీతభావములతో కూడుకొన్నది. అకర్తవ్యమును గూడా విధేయముగా బోధింపవలె నని వారి సంకల్పము–కావ్యములో నీచుడు కూడా ప్రధాననాయకుడు కావచ్చు నని వారి నిశ్చయం. ఇట్టి నిశ్చితసంకల్పమునకు అనుగుణముగా రచనాపద్ధతి ఉండవలెనని తలచిన పాశ్చాత్యులు మంగళాంతత్వమును అతిక్రమించారు. ఇట్లాంటి విధానములోని ఔచిత్యానౌచిత్యసమీక్షను వేరొక రచనలో చేయతలచుకొన్నాను.

ఇట్లాంటి అభిప్రాయాలతో ఉన్న పాశ్చాత్యులు హాస్యము అంతటా ప్రధానప్రతిపాద్యము కావలె ననుకున్నారు.

ఈఆశయము ప్రాచ్యభావము పరిపూతమై మన భారతీయహృదయములలోకి సంక్రమించింది. అనాలోచితముగా వెంటనే బయలుదేరిన ఆఘాతం ప్రాచీనులపైన బడి పలకరించుతున్నది. హాస్యరసమునకు పరిపుష్టిని సంపాదించుట మవసర మని ఆక్షరాస్యు లందరూ ఆందోళనము చేస్తున్నారు. ఈపురోభాగిపదగమనాభిరుచి కలగటంలో మంచి హేతువు కనపడటం లేదు. హాస్యముకు ఆచరణ

* కుత్సితస్వభావము గలిగి డాంబికాచారముతో ఉన్న యతివానప్రస్థగృహస్థులు బౌద్ధభిక్షుకులు వికృతివేషములను ధరించి అసత్యాశ్లీలభాషణము చేస్తూ వ్యభిచారిభావబహుళంగా ప్రవహసనమే ప్రధానత్వంగా ఒక అసత్పురుషుని దుష్టచరిత్రమును నిరూపణం చేసినప్పుడు శుద్ధమనీ, వేశ్యాదిసంబంధం కల్పించి తద్వారా అనేక వేశ్యల దుష్టచరిత్రమును హాసనీయంగా ప్రతిపాదనం చేసినప్పుడు సంకీర్ణ మనీ ఊహింపవచ్చును.

మార్గములో పెట్టుకున్న పత్రికలు నేడధికముగా బయలుదేరినవి. హాస్యరసమును ప్రధానముగా తీసికొనకపోయినా కొంత ప్రత్యేక స్థానము నిచ్చి ఆదరణ చేసే పత్రికలు లేకపోలేదు. వ్యాసరచయితృప్రభృతులు హాస్యమును ఆదరింపవలె నని హెచ్చరించుచున్నారు. ముగ్ధలోకము గూడా ఆదరమును అధికముగా చూపుచున్నది. వీని కన్నిటికి కారణ మంతగా దురూహము కాదు కాని అకారణాన్వేషణము కంటె ఈ గడ్డలికాప్రవాహమునకు కొంత అనకట్ట అవసరము.

లోకములో సహృదయత్వము తగ్గిపోయిన దని నే ననలేను. ఆనందకోశములోని కావ్యకోణము ఆచ్ఛాదిత మైన దని అనక తప్పదు. లోకమునకు రసహృదయములోని మార్దవము తగ్గినది. హృదయచలనములో స్థాయిత్వం కుదరటం లేదు. భావసముదాయం విప్రకీర్ణకేశఖండాలమాదిరి చెదరి ఏకోన్ముఖంగా అతుకుకొనటం లేదు. అయస్కాంతములకు బదులుగా అయోద్రావకములు కాలవాహినిలో ప్రవహించుచున్నవి.

కుదురుపాటు తప్పిన లక్ష్యశుద్ధిని ప్రసాదింప మని పరమేశ్వరుని వేడుకొనవలసిన అవసరము కలుగుచున్నది.

హాస్యప్రతిపాదనము అసలు అనవసర మనేటంతటి ఛాందసత్వం నాలో లేదు. మనుష్యుని జీవితంలో వేదాంతము కవిత్వము మాదిరి హాస్యము కూడా అవసరమే. అవసరములో కూర్పును పొందిన హాస్యం ఆనందసంపాదకం అవుతుంది. మృదువైన హాస్యాన్ని నేనెంతో అభిమానించుతాను. హాస్యం సోపాధికం కాకతప్పదు. ఇది లోకోపాధికం అయ్యేటప్పుడు మార్దవం కలిగి ఉండాలి. సభ్యత్వమును విడువకూడదు. మాతాతపాదులు హాస్యప్రియులు. వారిది మనస్సు నొచ్చని హాస్యం. అందులో సభ్యత విడివడదు. ఉద్దిష్టాంశం చెదిరిపోకుండా ఉంటుంది. నిరుపాధికంగూడా హాస్యం ఉండటానికి వీలుం దని మానాన్నగా రంటారు. ఇట్లాంటి పక్షంలో లోకస్థితి అవసరం కాదు. అప్పుడు హాస్యం మృదులంగా ఉంటుంది.

శృంగారాదిరసాలలో ఉన్న ప్రతిపాద్యాంశం రసౌచిత్యమును సంపాదించటానికి సమగ్ర మవుతుంది. వానిలోని ఆఖ్యాయికకు ఇతరప్రయోజనం ఉండదు. అనుషంగికంగా నాంతరీయకంగా ఫలాంతరాలు రావచ్చు కాని అక్కడి లక్ష్యం రసానందము! హాస్యంలోని విధానంమటుకు భిన్నరీతితో ఉంటుంది. ఇందులో ఉన్న ఆఖ్యాయికకు సంబంధించిన గుణదోషాలను లోకం తెలుసుకోవటం పరమప్రయోజనం. ఈహాస్యం లోకంలో, మరమ్మతు చేస్తుం దని అభిజ్ఞుల ఆశయం. వేరొకటి ఫలంగా (రసానందం కాక) హాస్యము పుష్టిని పొందుతుంది. ఇతరరసాలలో రసానికై కథ ఆలంబంగా ఉంటుంది. ఇందులో కథకై రసం అవలంబన మవుతుంది. 'హాస్యం పరమ్పరయా ఫలజనకం' అని * ధనికు డంటున్నాడు. 'హాస్యం స్వతో నిష్ఫలం' అనే అభిప్రాయం ప్రాచీనహృదయాల్లో నాటుకొన్నది. అందువల్లనే ఇది ఉపసర్జనంగా తోడుపెళ్లికొడుకుమాదిరి ఉండవలసివచ్చింది. ప్రధాన మైన కావ్యఫలం పరనిర్వృతి అని పండితుల ప్రవచనం. అప్పుడు కథాపద్ధతి గుణీభూతం కావాలి. అసలు కథ, పద్ధతే గాని లక్ష్యం కాదుగా? సాధనం సాధ్యాన్ని అనుసరించాలి గాని సాధ్యకోటిలో చేరేది సాధనాన్ని అనుసరిస్తే డొంకతిరుగుడుతో పరంపరాప్రయోజనం అపేక్షింపవలసివస్తుంది. "సాధనతత్పరత్వమున సాధకసాధ్యము విస్మృతం బగున్" అని మా అన్నగారు దేవీసహస్రంలో నిర్వచించారు.

సాధనము సాక్షాత్సాధ్యతత్పరం అయితే మేలు. సాక్షాత్సాధనతత్పర మయినా పాక్షికంగా అంగీకరింపవచ్చును. పరంపరాసాధనతత్పరం కావటం మటుకు సహించలేము. హాస్యం స్వతో నిష్ఫలం కాబట్టి సాధ్యతత్పరం కాలేదు. శృంగారాదిరసాలు సాక్షాత్సాధనాలు—కథ పరంపరాసాధనం. కథ శృంగారాదిపరిపుష్టిని కలుగజేసి గాని సాధనం కాలేదు—అందువల్ల హాస్యం కథను ప్రధానం చేసుకోవటం కంటె శృంగారాదిరసాలకు అంగరసము కావటం ఉచితము—ప్రాచీనులు ఈతత్వమార్గాన్నే ఆశ్రయించారు—అవిధంగానే వాళ్లు కృతార్థు లయినారు.

అంగభావము పోకుండా ప్రాచీనులు హాస్యమును నిరూపించిన విధానమును పర్యాలోచనము చేస్తే హృదయానందము కలుగుతుంది. ప్రహసనాల్లో ఉన్న హాస్యం మొరటుదనం వహించింది—హాస్యం ఇక నక్క—అలేదురా! నాయినా! అనిపించుతుంది—ఎంత సేపటికి సామాజికునకు రసములో ప్రవణత కలిగించాలి. కాని విసుగు పుట్టించకూడదు. దూషకతాబీజా లుండరాదు. ఇట్లాంటి పలుకురాళ్లు చేసుపడకలు ఆరసవాహినిలో కలిసి ఉంటే సహృదయుని మనస్సు చివుక్కు మంటుంది. నిర్మాత ఈవిషయాలు నిరీక్షించాలి.

ప్రకృతకాలంలో ప్రచలిత మవుతున్న హాస్యము ఏరీతిగా ఉన్నదో పాఠకప్రభృతులే నిర్ణయించుకోవాలి. రసికు డైనా ప్రకృతహాస్యంలో ప్రావీణ్యం పొందలేడు. లక్ష్యశుద్ధి లేని అనుచిత హాస్యం, సాధ్యసాధనతత్పరం కాలేని అసమగ్రహాస్యం, విశుద్ధభావాలు విపరీతవికటహాస్యం ప్రకృతకాలంలో అతిశయించుతోంది. ఈవిధ మైన హాస్యానికి హెచ్చరికలు అనవసరం కాదా?! నవ్యవాణిలో నవరసస్ఫూర్తిని సంపాదించాలి. అప్పుడు.

"నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి"

* నచ నిష్ఫలావసానత్వ మేతేషా మస్థాయిత్వనిబంధనం హాస్యాదీనా మప్యస్థాయిత్వప్రసంగాత్, పారమ్పర్యేణ తు నిర్వేదాదీనా మపి ఫలవత్త్వాత్.

## మమ్మల్నే మేమెరగం

అటు రాయలసీమ యిదివరకే మన చాళుక్యసీమ (సర్కారుల) మీద కారాలూ మిరియాలూ నూరుతూ వుంది. దానికి సాయం కాకతీయ (నైజాం ఆంధ్ర) సీమ యిప్పుడు మనమీద కళ్లెర్రజేస్తోంది.

మనము పత్రికలు ఎరపెట్టి వారి డబ్బు దోచుకుంటున్నామట. వారి కష్టసుఖాలనుగురించి మనకి శ్రద్ధ లేదుట. పైగా "*అస్సలు విషయ మేమన? నిజామాంధ్రులు సగము తురక అనియు, వలసపోయినవా రనియు, తెలుగు తెలియనివా రనియు, లెక్కా జమా లేని మనుష్యు లనియు........నానావిధములుగా బ్రిటిషాంధ్రులు తలతురు"ట. "......పత్రికలు అనేకములు పుబ్బలో పుట్టి మఖలో గంతుకొట్టుచున్నవి కాక బాలారిష్టములు దాటినవి కలవు. అవి యైన నిజాంరాష్ట్రాంధ్రులలోని మంచి కవులచేతను, నాయకులచేతను పద్యములు, వ్యాసములు, విమర్శలు వ్రాయించరాదా? మాసమున కొక్క తూరి యైన నిజాంరాష్ట్రాంధ్రుల సమస్య నొక్కదాని చర్చించరాదా"ట. "కావున నే చెప్పబోయిన దేమన మన రాష్ట్రములోని ఆంధ్రుల మైన మనవిషయములను వారపాటున నైన—సంవత్సరమున కొక్క తూరియైన, పితృపక్షస్మరణ రీతియైన చర్చించని పత్రికలను మనము తెప్పించి సాయపడుటవలన నేమిలాభము" ట.

కనక "పత్రికాధిపతులకు గూడ పాఠములు చెప్పవలెను. వారి విధిని వారికి అద్దములో చూపినట్లు చూపవలెను. తమయెడ నిరాదరణ చూపు పత్రికలను వెంటనే నిలిపివేయవలెను. అరకంటగూడ వానిని చూడవలసిన అవసరము లేదు" ట.

కాకతీయసీమలో మన ఆంధ్రులు ౩౦ లక్షలకు పైగా వున్నారు. మన పత్రికలలో చాలావాటికి కాకతీయసీమవారి సాయం చాలా వుంది; కాని వారి కష్టసుఖాలు మనకి కనపడవు. అదృష్టే లేదు మనకి.

ఇది అక్షరాలా నిజం.

అయితే: కాకతీయసీమవారు వొక సంగతి గుర్తించవలసివుంది. విద్యలోనూ, నాగరికతలోనూ, ప్రగమనశీలతలోనూ, మీకంటేనూ, రాయలసీమవారి కంటేనూ (చాళుక్యసీమకు చెందిన) మేము కొంచెం ముందుకు వెళ్లినమాట నిజమే.

మొదట్లో, మేము, చెదిరిచెదిరి వున్న ఆంధ్రతేజస్సు నంతటని వొక చోట కేంద్రీకరించి మళ్ళీ భారతాకాశంమీద వొక్క అపూర్వవిద్యుత్ప్రకాశం కలిగించగల దివ్యమైన వొక వుద్యమం ప్రారంభించివుండడం కూడా వాస్తవమే; కాని మాలో కూడా ఆంధ్రత్వం చాలావరకు విరిగిపోయి వుండడంవల్ల యితరపరగణాలనుంచి వచ్చిన వుప్పెనలో పడి ఆత్మజ్ఞానం కోల్పోయినాము.

మొదట బంగాలీవారి వెనకాలపడి కొన్నాళ్లు దేవుళ్ళాడాము. తరవాత గుజరాతీల పాదాలు ఆశ్రయించాము. ఆదాస్యం యింకా అలా వుండగానే మాప్రముఖులు యిప్పుడు హిందూస్థానీల నాశ్రయించారు.

ఈ విధంగా మేమిప్పుడు భావదాస్యంలో కూలిపోయివున్నాయి. ఈ స్థితే మాకు సామ్రాజ్యాధిపత్యంగా కనపడుతోంది. ఈ ఆవేశం మాకు ఆత్మజ్ఞానమూ, ఆత్మగౌరవమూ, ఆత్మాభిమానమూ లేకుండా చేసింది. నిజాన్ని స్పష్టంగా చెప్పవలసివస్తే యిప్పుడు మమ్మల్నే మేమెరగం.

తలుచుకుంటే దుఃఖం వస్తోంది. ఏమాత్రమో తక్కువగా మూడు కోట్ల జనసంఖ్యగల జాతి మనది. ఒకప్పుడు ఆసేతుశీతాచలందాకా అవక్రవిక్రమంతో ధగద్ధగితం చేసిన చరిత్ర మనది; కాని యిప్పుడు అదివ్వా లేమీ లేవు. భగ్నావశేషా లేమీ లేని జాతి యిప్పుడు మనది వొక్కటే.

నేతిబీరకాయవంటి ఆంధ్రవిజ్ఞానపరిషత్తుకోసం బిక్కిరీలు పన్ని మేము రాయలసీమవారి సాహచర్యం లేకుండా చేసుకున్నాము. ఇక మిమ్మల్ని మేము పరిగణించడం లేదంటే ఆశ్చర్యం యెందుకూ?

మీకూ మాకూ ప్రభుత్వం విషయంలో భేదాలు వుండవచ్చు; కాని మనమూ మనమూ తతిమ్మా విషయాలలో విడిపోయివుండవలసిన అవసరం యేమీ లేదు. ఆంధ్రదేశానికి చాళుక్యసీమ యెంత అవసరమో రాయలసీమా, కాకతీయసీమా కూడా అంత అవసరమైనవే. నిజం చెబితే రాయలసీమలోనూ, కాకతీయసీమలోనూనే యిప్పటికీ ఆంధ్రవైభవానికి మాయని గుర్తులున్నాయి. కనక కాకతీయసీమకి చెందిన మిమ్మల్ని మరిచిపోయి—మీరు మావాళ్లే అని కూడా గట్టుకోకుండా మేము బాముకోగలిగింది యేమీ లేదు.

మీరు దెబ్బకి దెబ్బ తీస్తామంటే యేమనడానికీ మాకు సత్తా లేదు. అయితే: మేము తప్పు చేస్తే—మీరూ అలాంటి తప్పే చేస్తే జాతి యింకా తుక్కుతుక్కయిపోదూ?

ఎనిమిది జిల్లాలు ఆక్రమించివున్నారు మీరు. నిజానికి బ్రహ్మాండమైన శక్తి మీది. పైని ఆవరించియున్న విస్మృతి తొలగిపోతే వొక వొడ్డుకు చేర్చగల సత్తా మీది.

మీకంటే మాకు సౌకర్యా లధికంగా వుండడం నిజమే; కాని చెప్పలేదూ? మాకు ఆత్మపరీక్ష చేసుకునే యోగ్యత లేదు. హిందూదేశంలో వొక నూత్నశక్తి పొడచూపాలంటే ఆంధ్రదేశంలో ప్రత్యేకప్రయత్నాలు కూడా జటిలంగానే జరగా లనే జ్ఞానం లేదు మాకు.

* ౧౧–౩–౩౯ తేదీ గోలకొండపత్రికలో ప్రకటించబడ్డ భావకవి రామమూర్తిపంతులుగారి లేఖ చూడండి.

ఇన్ని కారణాలవల్ల మావల్ల యేమీ అవుతుందనీ, మేము పూనుకోని పని కానేకాదనీ మీరు అనుకోనక్కరలేదు. మా కంటే కష్టదశలో వున్నారు మీరు. అంటే యెక్కడ వొత్తిడి యెక్కువగా వుంటే అక్కడ స్వస్వరూపజ్ఞానం కలుగుతుంది. అందుచేత మీరే ఆంధ్రశక్తిని కేంద్రీకరించడానికి పూనుకోవలసివుంది. మీసందేశమే ఆంధ్రజాతికి సంజీవి అవుతుంది.

## ఆదివ్యమూర్తి మనకే వుండాలి

మా మిత్రులు భమిడిపాటి చిన యజ్ఞనారాయణశర్మగారి అకాల మృతికి మేము చాలా విచారిస్తున్నాము.

శర్మగారి వయస్సు చాలా చిన్నది; కాని శక్తి తెనుగుజాతికి నవజీవం సంఘటించజాలిందిగా వుండింది.

సంపన్నత సర్వసామాన్యంగా పరిగణించి ముందుకు వెడితే వీరు కవులు. పండితులు. నటులు. వస్తాదులు. దేశభక్తులూ దేశసేవకులూ మాత్రమే కాదు, ప్రవర్తకులున్ను.

ఈవిషయాలన్నిటిలోనూ వారియందు వొక విశిష్టత వుంది.

ఈవిశిష్టతే శర్మగారి మృతికి దేశంలో వొక విచారతరంగాన్ని లేరిపింది.

విశాఖపట్టణంజిల్లా యొక్క ప్రజాజీవనంలో శర్మగారి మృతి వల్ల యేర్పడిన దౌర్బల్యం తీరేది కాదు.

శర్మగారు కాంగ్రెస్సులో లీనమయి వుండేవారు; కాని హిందీ దురాక్రమణం గుర్తించి 'దూరంగా వుండు' అని ముదలకించినవారిలో వారు మొదటివారు. జాతికి మార్గదర్శకులున్ను. ఒకప్పుడు వారు శ్రీకంఠుడైన తమ కుమారునకు హిందీలో అక్షరాభ్యాసం చెయించడానికి సర్వమూ సిద్ధం చేసుకుని వుండివారు. అయితే జూలై (౧౯౩౮) ౧౮ వ తేదీని ప్రబుద్ధాంధ్ర వారికి హిందీయొక్క గుప్తకరాళదంష్ట్రలను బహిరంగపరచి చూపించింది. వెంటనే వారు ఆప్రయత్నం విరమించి సాంకర్యం లేని తమ ఆంధ్రత్వాన్ని ప్రకటించారు.

శర్మగారి ఆత్మకు మేము ఈశ్వరసాయుజ్యం కోరము. ఎంచేతంటే? విశాఖపట్టణంజిల్లాలో అనేకులకు వారి నడవడి వరవడిగా వుండవలసివుంది. తెల్లని కండువా జీరాడుతూ వుండగా మదగజంలాగ ముందుకు నడుస్తూ నడుస్తూ, మధ్యమధ్య మొగం వెనక్కి తిప్పి భ్రుకుటీగంభీరాలైన నిశితదృష్టులతో అనుచరులను ముందు కురికిస్తూ వారి దివ్యమూర్తి జిల్లా అంతటినీ ధైర్యసాహసాలతో నింపెయ్యవలసిన్ని వుంది.

## జస్టిసు మంత్రాంగం

డాక్టరు సుబ్బారాయన్‌గారు మొన్నటి సమావేశంలో మదరాసు శాసనసభకు, జస్టిసుమంత్రులమీద విశ్వాసం లేదని వొక ప్రస్తావన తీసుకువచ్చారు. అయితే: దాన్ని బలపరిచినవారు నలభైయిద్దరే; కాని యేనభైమంది, జస్టిసుమంత్రులను వెనకవేసుకువచ్చి దాన్ని తుప్పున యెగరగొట్టేశారు.

పాపం, సుబ్బారాయన్‌గారెన్నో గాలిమేడలకు ప్లానులు తయారు చేయించుకుని వుంటారు; కాని అవన్నీ అలుముకుపోయాయి. సుబ్బారాయన్‌గారి పక్షం పునాదులు కూడా వూగిసలాడిపోయాయి. చివరకి వున్న గోడు కూడా చెడింది.

ఈప్రస్తావన తీర్మానం అయితే జస్టిసుమంత్రులను చెలిగెయ్యొచ్చు అని కలలు నింపుకుని వున్నవారు చ—ల్ల—గా చప్పబడ్డారు.

ఏం? ఇదిలా యెందుకు జరిగిందీ?

పరిశీలన చేస్తే గాని బోధపడని రహస్యం యేమీ లేదు దీల్లో. ఉన్నదల్లా వొక్కటే కారణం. అదేమిటంటే? ఈప్రస్తావన తేవడానికి సుబ్బారాయన్‌గారికి లేశమైనా యోగ్యత లేదు.

జ్ఞాపకం లేదూ? గౌహతీకాంగ్రెస్సు తీర్మానాన్ని అస్తవ్యస్తం చేసిన కాంగ్రెస్సువారి ఆసరా చూసుకుని కొన్ని సంవత్సరాలపాటు మంత్రిపదవులను కలుషితాలుగా చేసేసినవారే కాదూ యీ సుబ్బారాయన్‌గారూ?

ఈప్రస్తావన ప్రతిపాదిస్తూ సుబ్బారాయన్‌గారు చాల బులబులాగ్గా మాట్లాడారు. వారికి వెనకా ముందూ కూడా గట్టి ఆలంబం యేమీ దొరకలేదు. ఇవాళ యిందుకు కొత్తగా మొలుచుకువచ్చిన కారణాలేమీ లేవు.

జస్టిసుపక్షంవారు మంత్రిపదవులలో కణాయించుకూర్చున్నారు. ఇది మాత్రం నిజమైన కారణం. చాలా బలమయింది కూడానూ యిది.

అసెంబ్లీ యెన్నికల సందర్భంలో గవర్నమెంటువారు జస్టిసుపక్షాన్ని చాలా తీవ్రంగా విమర్శించారన్నారు. ఈప్రస్తావనకిదొక కారణంగా చెప్పారు వారు. గవర్నమెంటు విమర్శించడం నిజమే. అయితే అది ఈప్రస్తావానికి ఏంబలం కలిగిస్తుందీ? గవర్నమెంటువారు జస్టిసుపక్షం అప్పట్లో నిర్లక్ష్యంగా వుండడం తప్పన్నారు. అవును. అప్పుడువారలా వుండడంవల్లనే వోటర్లు మరపురాని గుణపాఠం చెప్పారు. అయితే అసెంబ్లీవోటమి జస్టిసుమంత్రులను మదరాసుశాసనసభలో యేం కుంగదీస్తుందీ? అదీగాక: గవర్నమెంటువారు జస్టిసుపక్షంవారిని అసెంబ్లీయెన్నికలసందర్భంలో మందలించారు; కాని మద్రాసుపరిపాలన సందర్భంలో యేమీ అనలేదే? ఈసన్నివేశాన్ని తడవడానికి సుబ్బారాయన్‌గారికిందులో పాయం లేదీ?

సుబ్బారాయన్‌గారు, అసెంబ్లీయెన్నికల్లో కాంగ్రెస్సుపక్షంవారు జస్టిసుపక్షంవారిని వోడించేశారన్నారు. నిజమే. ఇందులో దాపరికం యేం వుందీ? కనకనే కాంగ్రెస్సువారధికసంఖ్యతో అసెంబ్లీలో ప్రవేశించారు. జస్టిసువారు ముందుకి అడుగు వెయ్యలేకపోయారు. అయితే: దీనివల్ల సుబ్బారాయన్‌గారికి వొరిగిందేమిటీ?

చివరికి వోడిపోయినా మొగతనం వున్నవారు కనక జస్టిసువారు "మేమున్నా" మంటూ ఆయెన్నికల్లో పోటీకి నిలిచారు.

సుబ్రాయన్‌గారప్పు డేమయిపోయారూ? వారి భ్రూసేనా యెత్తినవా రెవరేనా వున్నారా ఆరోజుల్లో? పోనీ, వీధిమొహ మేనా యెరుగుదురా సుబ్రాయన్‌గారప్పుడు?

అయిన రెండు చెంపపెట్లూ తిని వెనకటి కొక పెద్దమనిషి "నన్ను కొట్టడం కాదు, మరి మావాణ్ణి కొట్టు నీసంగతి తెలుస్తుం" దన్నాట్ట.

ఇంకా యేవేవో యిలాంటివే కొన్ని కుంటికారణాలు యేకరువుపెట్టారు సుబ్రాయన్‌గారు; కాని అసలుకారణం వారు చెప్పలేదు. స్మరించనేనా లేదు. ఎవర్నీ జ్ఞాపక మేనా చేసుకో నివ్వలేదు.

అదేమిటంటే?

ఇప్పటి మంత్రాంగం యేర్పడిన రోజుల్లో యెన్ని విధాల కాళ్ళా వేళ్ళా పడిపాకులాడినా యీసుబ్రాయన్‌గారిని మంత్రాంగంలోకి చేరనిచ్చారు కారు జస్టిస్సుపక్షంవారు. అసలగ్నిహోత్రం యిదీ. అప్పణ్ణుంచీ రవులుతూనే వుం దిది; కాని యింతకాలానికి భగ్గుమనడానికి బదులు రవిలిరవిలి వున్నక్రనే, నుసిచేసేసింది.

ఈప్రస్తావన సందర్భంలో కాంగ్రెస్సువారు కొంచెం విచక్షణ కనపరుస్తా రనుకున్నాం; కాని మరోలాగ జరిగిపోయింది. వారు తమ ద్వేషాన్ని వెళ్లగక్కుకున్నారు. అంతే.

మద్రాసుశాసనసభలో యీప్రస్తావన చర్చకి వచ్చేటప్పటికి కాంగ్రెసువా రల్లా యిద్దరే వున్నారు. వారిలో వొకరు జస్టిస్సు పక్షం గెంటెయ్యగా యివతలికి దూకినవారే. ఇక రెండోవారు మన వోబిరెడ్డిగారు. అప్పుడే రెడ్డిగారు శాసనసభలో ప్రవేశించారు.

కాంగ్రెస్సు అలా ఆజ్ఞాపించిందో, వెనకవున్న దుష్టగ్రహాలే తప్పుదారిలోకి లాగేశాయో కాని వోబిరెడ్డిగారు చాలా పొరపాటు చేశారు. వారు చేసిన పని యిక దిద్దుకోడానికి వల్లకాదు.

సుబ్రాయన్‌గారి మంత్రిహోదా సమయంలో ద్వంద్వప్రభుత్వాన్ని పడగొట్టవలసిం దని కాంగ్రెస్సు ఆజ్ఞ. అసలు మంత్రి పదవు లప్పుడు కాంగ్రెస్సువారికి దఖలుపడవలసింది. అయితే: కాంగ్రెస్సు ఆజ్ఞని స్మరిస్తూ వాటిని తిరస్కరించడం దాకా వారు సరిగానే మసులుకున్నారు; కాని తరవాత వారు చాటుచాటున నక్కి సుబ్రాయన్ మంత్రివర్గాన్ని అతికారు. తరవాత అది పడిపోకుండడానికి తమ చేతులు వోటొగ్గారు కూడానూ. జస్టిస్సువారు మంత్రాంగాన్ని స్వాధీనపరుచుకోకుండా వుంటే చాలు ననుకున్నారు వారప్పట్లో.

తరవాత, కొన్నాళ్లకి, జస్టిస్సుపక్షంవారు సుబ్రాయన్ మంత్రాంగంమీద అవిశ్వాసప్రస్తావన తెచ్చినప్పుడు కాంగ్రెస్సువారు, వోటింగుసమయంలో తమలో తాము కుమ్ములాడుకుని కొందరివతలికి వచ్చేశారు. కొందరు శాసనసభలో హాజరుగా వుండిన్నీ, గౌహాతీనిర్ణయాన్ని స్మరిస్తూ వుండిన్నీ, పక్షానికే కాకుండా ఆత్మకుకూడా ద్రోహం చేసుకుంటున్నా మని యెరిగివుండిన్నీ, ద్వంద్వప్రభుత్వాన్ని పడగొట్టడానికి అయాచితంగా—చేతికి దొరికిన సన్నివేశాన్ని జారవిడిచి నిమ్మకు నీరుపోసినట్టు వూరుకున్నారు.

ఏం? అప్పటిలాగే యిప్పుడు కూడా—లాభం లేదని స్పష్టంగా తెలుస్తూ వున్నప్పుడేనా కాంగ్రెస్సువారు తటస్థంగా వుండిపోగూడదూ?

పోని, సుబ్రాయన్‌గారు, తమ హయాములో ప్రెసిడెన్సీ మాట అలా వుండగా మన కేమేనా వొరగబెట్టారా?

ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకి కీ. శే. దహాగం లక్ష్మీనారాయణగారి భూరివిరాళంమట్టుకుండా చేసినవారీసుబ్రాయన్‌గారే కాదూ?

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు విషయంలో మనలో మనకున్న భిన్నాభిప్రాయాలను కక్షలుగా మార్చి, వాటిని గట్టిపరిచి, నెల్లూరు రాయలసీమలకూ, చాళుక్యసీమ (సర్కారుల)కూ ఆరిపోనిక్రోధాగ్ని పుట్టించినవారీసుబ్రాయన్‌గారే కాదూ?

మంత్రిపదవుల్లో చేరకుండా మన తెనుగువారికి దేవిడీమన్నా చెప్పింది యీసుబ్రాయన్‌గారే కాదూ?

జస్టిస్సుపక్షంలో నేనా మన ఆంధ్రులకు పరగణా అంతటిమీదా చెలామణీ అవుతూ వున్న నాయకత్వాన్ని కూల్చెయ్యడానికి నేటికి గూడా వుచ్చులు పన్నుతూ వున్నవారీసుబ్రాయన్‌గారే కాదూ?

పోనీ, యీ సుబ్రాయన్‌గారు తుంగభద్రాప్రాజెక్టువిషయంలో యేమేనా అనుకూలప్రయత్నాలు చేశారేమో చెప్పగలరా వోబిరెడ్డిగారు?

ఇప్పుడు రాయలసీమలో విలయతాండవం చేస్తూవున్న కరవువల్ల బాధపడుతూ వుండేవారికేమేనా రక్షణలు కలిగిస్తున్నారా యీ సుబ్రాయన్ గారు?

ఇలాగ యెన్ని విధాల చూసినా యిప్పుడు కాంగ్రెస్సువారు ఈ ప్రస్తావనకు అనుకూలంగా వోటు చెయ్యడం కేవలమూ అనుచితంగా వుంది.

అదలా వుండగా: ఈ ప్రస్తావన తీర్మానం అవుతుందే అనుకుందాం. మంత్రిపదవులు కాంగ్రెస్సువారికి దఖలుపడతాయా? వోబిరెడ్డిగారిమట్టుకేనా వొక పదవి వాగ్దత్త మయిందా? సుబ్రాయన్‌గారి స్నేహితులీమంత్రాంగాన్ని స్వాధీనం చేసుకోవడం కోరతగ్గదా?

సత్తా వుంటే కాంగ్రెస్సు మంత్రిపదవులు స్వాధీనపరుచుకోవాలి. లేకపోతే ప్రతికూలపక్షంగా వుండి పక్కబెదురు పుట్టిస్తూ వుండాలి; అంతే కాని, యీ సత్రకాయపని దానికి అప్రశస్తమే కాదు, అపాయకరమున్నూ.

ఇంతకీ: బొబ్బిలిమంత్రాంగానికి వివేకం వుంది; కాని లోకజ్ఞానం చాలదు. రాజనీతి తెలుసును; కాని ప్రయోగకౌశలం తక్కువ. నాయకత్వానికి అర్హత వుంది; కాని ప్రజాశక్తియొక్క వక్రగతులింకా బాగా బోధపడలేదు. దొరతనంలో మాత్రమే పలుకుబడి వుంటే చాలు ననుకునే మనస్తత్వం యెంత త్వరగా మార్చుకుంటే అంత త్వరగా బాగుపడుతుంది జస్టిస్సుపక్షం.

నిజానికి గండం గడవడం వొక గడవడం కాదు. అసలిదిగండమున్నూ కాదు. ముందు ముందు రాడమూపే క్లిష్టపరిస్థితులకిది మచ్చుముక్క.

అసెంబ్లీ వోటమి తలుచుకుని జస్టిస్సుపక్షం విచారించనక్కరలేదు. జస్టిస్‌పక్షానికి మద్రాసురాష్ట్రమే కార్యక్షేత్రం. తమ పక్షం అఖిలభారతం చేసుకోవాలనే ఆశ కాని, దీక్ష కాని వారికవసరం కాదు. ఈ రాష్ట్రానికి మాత్రమే సంబంధించిన వొక బలమైన పక్షం యిప్పుడు చాలా అవసరం. జస్టిస్సుపక్షానికి ఆయోగ్యత చాలా హెచ్చుగానే వుంది. అయితే: కాంగ్రెస్సుప్రవాహంలో జటిలత తక్కువగానే వున్నా అది వురకలు వేసుకుంటూ వస్తోంది. ప్రజల దృష్టి కాంగ్రెస్సువేపుకి మొగ్గివుండడం స్పష్టమే. జిల్లాబోర్డులలోనూ, నగరీయసంఘాలలోనూ, శాసనసభలోనూ అధికారపదవులు ఆక్రమించుకోవాలని వారు చేసుకున్న తీర్మానం కాంగ్రెసు వారిలో కూడా అంతఃకలహాలను రెచ్చగొట్టి వొక వూపు వూపేసేదే కాని ప్రస్తుతం అది జస్టిస్సుపక్షానికి బలమైన ప్రతికూలశక్తి. దాన్ని జయించాలంటే మాటకి మాట అందించడం కాదు మార్గం. వోటర్ల హృదయాలను తమవేపుకి తిప్పుకోవాలి. ఆమార్పు వారికి, వారి కష్టసుఖాలను అరించి పాలించడం వల్ల మాత్రమే కలుగుతుంది; కాని అధికారప్రయోగం వల్ల కాదు.

## నిదానమూ, చికిత్సా కూడా తప్పుగానే వున్నాయి

ఇప్పుడు పాఠశాలల్లో వాడబడుతూ వున్న తెలుగువాచకాల విషయం కొంచెం కదిలింది.

మొన్నటి శాసనసభాసమావేశంలో విద్యాశాఖ గ్రాంటుమీద చర్చ జరిగినప్పుడు సభ్యులు కొందరు వాచకాలు ప్రతియేటా మార్చడంవల్లకలుగుతూవున్న అనర్థాలూ, కష్టనష్టాలూ వెల్లడిచేశారు.

దీనిమీద అయిదేళ్ళకు లోపుగా వాచకాలను మారుస్తూవుండకూడదనీ, ఈలోపునే మార్చవలసిన అవసరం కనపడితే మొగపిల్లల పాఠశాలలవిషయంలో ఎడ్యుకేషనల్ ఆఫీసర్ల అనుమతినీ ఆడపిల్లల పాఠశాలల విషయంలో ఇన్‌స్పెక్టరమ్మల అనుమతినీ పొందాలని దొరతనంవారు ఆర్డరు జారీచేశారు.

బాగానే వుంది.

అయితే: ఈఆందోళనమూ, యీఫలితమూ కొంతవరకే బాగున్నాయి.

ఈ వాచకాల విషయంలో యేటేటా మార్చడంవల్ల కలిగే ధననష్టంకంటే మరొక గొప్ప అపాయం వుంది. శాసనసభ్యులు ఆవిషయం ప్రస్తావన చెయ్యలేదు. బహుశా అది వారి తాహతుకి మించినదై వుంటుంది.

తెలుగుభాషలో యిప్పుడు చాలా రకాల వాచకాలు అమల్లో వున్నాయి. కొద్దిరోజుల్లో మరికొన్ని కొత్తవిన్నీ బయలుదేరే సూచనలు కనపడుతున్నాయి.

ఇటీవల తాలూకా, జిల్లాబోర్డుల అధ్యక్షులూ, ఉపాధ్యక్షులూ, సభ్యులూ కొందరీవ్యాపారంలో ప్రవేశించారు.

ఈ వాచకాలను పాఠశాలల్లో ప్రవేశపెట్టే సందర్భాల్లో దుర్నీతి ప్రబలుతోందని వదంతి కూడా వుంది.

అయినా............

పోటీ వచ్చినపుడు వస్తువుల యోగ్యత హెచ్చాలి; గాని తగ్గరాదు; అయితే తెనుగువాచకాల విషయంలో మాత్రంయిది తల్లకిందులయిపోతోంది.

ఇప్పుడున్న తెనుగువాచకాలలో అనేకాలు వట్టి తుక్కు. వాటిమీద పెద్దపెద్ద ఉపాధ్యాయులపేర్లూ, ఇన్‌స్పెక్టర్ల పేర్లూ వుంటాయి; గాని విప్పి చూస్తే అవి మేడిపళ్ళు.

మన శాసనసభ్యులకు తెనుగులో ప్రవేశమే వుంటే—ఈ తెనుగు వాచకాలు వారు చూసేవుంటే ఈ విషయంలో బాగా ఆందోళనం చేసివుందురు.

వాచకాలు టెక్స్టుబుక్కుకమిటీవారివల్ల అప్రువు కావాలనీ, అప్రువు అయినవే వాడుకలోకి వస్తున్నాయనీ యెరుగుదుము. కాని కమిటీవారు ఆపుస్తకాలను చదివే అప్రువు చేస్తున్నారా? అసలు ఆకమిటీ మెంబర్లలో కొంతమందికి తెనుగుపుస్తకాలు పరీక్షించడానికి తగిన యోగ్యత వుందా?

ఈవిషయం పరిశీలన చెయ్యకుండా యేమి మార్పులు చేసినా యేమీ లాభం లేదు. దొరతనంవారిప్పుడు పూనిన శ్రద్ధవల్ల పిల్లల పోషకులకు కొంతవరకూ ధననష్టం తగ్గవచ్చు; గాని పిల్లలు చెడిపోవడం తప్పదు.

ప్రజలకూ, దొరతనంవారికీ పిల్లల మనోబుద్ధుల వికాసమే ప్రధానమయితే టెక్స్టుబుక్కుకమిటీనిర్మాణం మంచి పద్ధతుల్లో జరగాలి. ఇప్పుడు వాడుకలో వున్న వాచకాలన్నీ మళ్ళీ అప్రువు కావాలి.

ఈపని జరగందే యెంత శ్రమ చేసినా అవి పైకి మెరుగులే అయి చివరికి హాస్యాస్పదాలయిపోతాయి.

## మన పత్రికల బండారం

"అబ్బా! ఈ తెనుగుపత్రికలతో ఉక్కిరిబిక్కిరయిపోతున్నామండీ. కుక్కగొడుగుల్లాగ మనిషి కొక పత్రిక చొప్పున బయలుదేరితే యెలాగండీ వేగడం!" అంటూ విసుక్కునేవారు మనలో చాలా మందే కనపడుతున్నారు.

ఎక్కడపడితే అక్కడ స్టాటిస్టిక్సు చూపించి వారికి సమాధానం చెప్పి వొప్పించడం సాధ్యమైనపని కాదు.

వారు ఈకింది అంకెలను వొకమాటు చిత్తగిస్తే సంతోషిస్తాము.

౧౯౩౩-౩౪ మద్రాసు ప్రభుత్వపరిపాలనానివేదిక ననుసరించి ఈపరగణాలో ౧౯౩౩ ఆఖరికి ప్రచారంలోవున్న పత్రికలు ౨౨౫. వాటి వివరాలు ఇవి. *

* ౧౯౩౩ సంవత్సరం ఆఖరుకి ౨౩౩ పత్రికలు ప్రచారంలో వున్నాయి. వాటి వివరాలు మాకు దొరకలేదు. ఇప్పుడు కొత్తపత్రికలుకొన్ని కనపడుతున్నాయి; కాని పాతపత్రికలు కొన్ని నిలిచిపోయి ఆధారం తగ్గించేస్తూనే వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లీషులో | ౯౦ | కన్నడంలో | ౧౭ |
| అరవంలో | ౧౧౮ | మళయాళీలో | ౧౮ |
| తెలుగులో | ౮౭ | ఇతరభాషల్లో | ౧౩ |
| రెండు–లేక–మూడుభాషల్లో | | | ౩౫ |

౧౯౩౧ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి మనకి సంబంధించిన ప్రధానజాతుల సంఖ్య యిలా వుంది.

| | |
|---|---|
| ఆంధ్రులు | ౨, ౬౩, ౮౭, ౩౦౦ |
| అరవలు | ౨, ౦౪, ౧౨, ౩౦౦ |
| కన్నడులు | ౧, ౧౨, ౦౬, ౩౭౦ |
| మళయాళీలు | ౯౧, ౩౮, ౬౧౫ |

అరవలు మనకంటే రమారమి అరవైలక్షలు తక్కువకాని వారిలో నొకలక్షా డబ్భయినాలుగువేల మంది కొక పత్రిక వుండగా, మనలో అయిదులక్షల నలభైతొమ్మిదివేలమంది కొక పత్రిక వుంది. దీన్నిపట్టి చూస్తే, అరులక్షల యిరవై రెండువేలమంది కొకటిచొప్పున వున్న కన్నడులకంటేనూ, అయిదులక్షల ముప్ఫయ్యేడు వేలమంది కొకటి చొప్పున వున్న మళయాళీలకంటేనూ మనం నిక్కృష్టంగా లేము కదా అనుకుని తృప్తిపడదామంటే కన్నడుల ౧౭ పత్రికలలోనూ నాలుగూ, మళయాళీల ౧౮ పత్రికలలోనూ మూడూ దినపత్రికలు; కాని మనకి "యేకమేవాద్వితీయం—వొక్కటేదినపత్రిక.

పోనీ, "మంది యెక్కువయితే మజ్జిగ పల్చన" అన్నట్టు చాలా పత్రికలు వుండడంవల్ల అరవవారిలో చందాదారులు తక్కువగా వుంటారేమో అంటే అరవపత్రికల కొక్కదాని కేనా నాలుగువేలకు తక్కువ చందాదారు లుండరు. పైగా అంతమాత్రమే వున్న అరవపత్రికకు గౌరవం తక్కువ. మనపత్రికలలో దేనికేనా రెండువేలకు పైని చందాదారు లున్నట్టైనా చెప్పగలరా?

అయితే: హిందీపత్రికలకు మాత్రం మనవారు చాలామంది చందాదారులుగా వున్నారు. ౧౯౩౪ సెప్టెంబరు ఆఖరుకి (హిందీ) మాధురిపత్రికయొక్క తెనుగు చందాదారుల సంఖ్య ౨౨౦౦. విశాలభారతికి ౧౫౦౦. మన పెరట్లోనే వుండి ప్రాణాలు కొరికేస్తూ వున్న హిందీప్రచారకపత్రికయొక్క తెనుగుచందాదారుల సంఖ్య సంపాదించా లంటే మాకు సాధ్యం కాలేదు; కాని అది పైసంఖ్యలకు కొన్నిరెట్లు హెచ్చుగా వుంటుం దని మాత్రం చెప్పగలం.

ఏతావతా: స్వయం పాపాయంతో ముందుకి తెల్లిపోయిన బంగాళీలతోటీ, కాంగ్రెస్సు ఊతం చూసుకుని విలయతాండవం చేస్తూ వున్న హిందూస్థానీలతోటీ పోలిక చెప్పుకోడానికి మన కర్హత లేకపోయినందుకు మేము విచారించము; కాని మనకంటే తక్కువ వున్న అరవవారి యెదట తలయెత్తుకు తిరగడానికి మనకి యోగ్యత లేదు.

ఏం?......మన పత్రికల స్థితి యిలా యెందుకుండి!

కారణం స్పష్టమే.

ఇప్పటికూడా మన విద్యార్థికులు ఇంగ్లీషులోనే మునకలు వేస్తున్నారు. విద్యావిహీనులు హిందీలోకి కొట్టుకుపోతున్నారు. పైపెచ్చు బహుళప్రచారం వున్న మన తెనుగుపత్రికలు భారతజాతీయత పేరు చెప్పి మన ఆంధ్రత్వాన్ని విరిచేస్తున్నాయి.

ఇంచేతే, అన్నివిషయాల్లోనూ కూడా వెనకపడి మనం మగ్గిపోతున్నాము.

## ఉజ్వలరూపంతో ఆంధ్రవారపత్రిక

ఇన్నాళ్లకి ఆంధ్రవారపత్రిక మాకు దర్శనం యిచ్చింది.

ఇప్పుడు మాయెదట వున్నది కొత్త రూపంలో రెండో సంచిక.

డబ్బుంటే కొండమీది కోతి దిగివస్తుం దంటారు; కాని నాగేశ్వరరావుపంతులుగారు తలుచుకుంటే ఆకొండే గద్దెకదులుతుంది.

సంచిక చిత్రపటాలతో చాలా ముద్దుగా వుంది. మామూలుపంథాలో రచనలు కూడా చక్కగానే వున్నాయి.

అయితే: ఇది ఆంధ్రపత్రిక; కాని ఆంధ్రహృదయాన్ని గుబగుబలాడించే రచనలూ, చిత్రపటాలూ యిందులో చాలా తక్కువగా వున్నాయి.

మొదట ఆంధ్రోజ్జీవనం కోసమే దీన్ని ప్రారంభించిన పంతులుగారు క్రమేపీ ఆవుద్దేశం మార్చుకున్నారు.

చిత్రం! అనాంధ్రుల మధ్య వున్నప్పు డిది ఆంధ్రులకోసం పలవరించింది. ఆంధ్రులమధ్య వుండి యిప్పుడు అనాంధ్రుల తరఫు రాయబారిలాగ ప్రవర్తిస్తోంది.

"హిందూ" యొక్క వారసంచిక కొత్త రూపంతో బయలుదేరినప్పుడు "తెనుగులో యిలాంటి పత్రిక బయలుదేరుతుందా" అని గుటకలు మింగాము. ఇన్నాళ్లకి ఆవుబలాటం తీరింది; కాని అన్యభాషాశ్లిష్టగీతం చెవుల్లోనే రింగురింగు మనే టట్టు యిది కళ్లయెదటనే మినమినలాడుతోంది.

తెనుగుభాషలో పత్రిక నడపడం తెనుగుజాతి నుద్బోధించడానికి గాని తెనుగుతనాన్ని మరిపించడానికి కొరగాదు.

తలుచుకుంటే పంతులుగా రిప్పుడేనా యీలోటు తీర్చగలరు. ఎలాగంటే? తప్పకపోతే వారు దైనికపత్రికను భారతీయతకోసమే వినియోగించుకోవచ్చు; కాని వా రీ వారపత్రిక నేనా ఆంధ్రజాతీయతకు ధారపోస్తే అదే పదివేలు. ఏమంటే? వారపత్రికను చూసేవారు నూటికి నూరుగ్గురూ పల్లెటూళ్లవారు. ఆపల్లెల్లోనేనా ఆంధ్రత్వాన్ని సంకరం కాకుండా చూస్తే తెనుగుతల్లి దిగులు తీరిపోతుంది.

ఆంధ్రు లందరూ ముద్దులుమూట కడుతూ వున్న ఈ ఆంధ్రవారపత్రికను ఆదరిస్తా రని నమ్ముతున్నాము. పత్రికలు జనసామాన్యాన్ని దారిలోకి తెచ్చిన సన్నివేశాలు చాలానే వున్నాయి. అయితే: జనసామాన్యం పత్రికలకు వరవడి దిద్దిన సన్నివేశాలు కూడా లేకపోలేదు.

ఎక్కడికి వెళ్లినా, భాషాప్రవేశమూ, ప్రీతీ, ఆత్మాభిమానమూ వున్న మనవారంతా హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం గుర్తించివుండి తదనుగుణంగా మాకు ప్రోత్సాహం కలిగిస్తున్నారు.

మొన్నటి డిసెంబరులో హిందీప్రచారానికి అనుకూలంగా పత్రికలకు రాసిన మన ప్రముఖులలో చాలామంది హిందీమహావిద్యాలయాలకు చెందిన ప్రచారకుల ప్రార్థనలకు వశులై అలా రాశారుట. చెప్పారుట.

గుంటూరిలో ఒక హిందీప్రచారకుడు "దక్షిణభారత హిందీప్రచారసభా, ఇంకా అలాంటివిద్యాలయాలూ తుస్సిండియాకంపెనీ లన్నమాట" అని చాలా విచారంతో చెప్పి మాకు మరింత కార్యభారం కలిగించాడు.

విరాళా లిచ్చీ, పరీక్షలకు కూచునీ, హిందీని నెత్తెక్కించుకుంటూ వున్న మా తెనుగుసోదరులు ఈఆత్మవినాశకోద్యమాలనుంచి తప్పించుకోవాలని మనవిచేస్తున్నాం.

సంపాదకుడు

"............హిందీ—ఉద్యమమునుగురించి మునుపు నాకు తెలియని సంగతులు యిప్పుడు తెలిసినవి. ఇందులో కూడా "స్వార్థపరు లుంటా" రనుకోలేదు. బంగాళీలోనూ, మరాఠీలోనూ గల గ్రంథాలు హిందీలో లేవని విన్నాను. ఆభాషలో గొప్పగ్రంథాలు వెలసిన వన్న వాదము మిథ్య. తులసీదాసురామాయణము తెనుగులోనికి అనువాదము చేసినారు ఒక రిద్దరు తెనుగు కవులు. మూలము కాశీలోనివారి కయినా తెలియదట. తులసీదాసునాటిహిందీకి, నేటి హిందీకి వ్యత్యాసము ఏర్పడ్డ దని విన్నాను. పృథ్వీరాయరాసా అనే గ్రంథమంతా నేటికిన్ని అచ్చుపడలేదు. చదివేవారు లేరని Ling-survey లో వ్రాసి ఉన్నది.

—గిడుగు వేంకటరామమూర్తి"

"........దేశసంపర్కము లేకున్నను ఆంగ్లసంపర్కముచేతను, హిందీమూలకమునకూడ నని కొందరు, ఆంధ్రభాషకు నపచారము కల్గుచున్నదనియు, తదుద్ధరణమునకు పాటుపడవలసియుండు ననియు జెప్పకతప్పదు. 'ప్రబుద్ధాంధ్ర' ప్రత్యేక మీసేవను బూనినది. ఆపత్రికయే నిజముగ నాంధ్రత్వమును బోషించుచున్న దని చెప్పదగును. ఆంధ్రు డేవిధముగ దన వ్యక్తిత్వమును బోగొట్టుకొనుచున్నాడో ఆపత్రిక విశదము చేయుచున్నది. ఆంధ్రు లేప్రాంతమున నున్నను నాపత్రికను జదివి ప్రబోధము గాంచదగును........"

(౫—౪—౩౫) ఆంధ్రపత్రిక

---

## ఉదయినికి స్వాగతం

ఉదయిని * వొక కొత్తపత్రిక. సంపాదకులు కొంపెల్ల జనార్దనరావుగారు. రెండుమాసాల కొక సంచిక చొప్పున ప్రకటించబడుతుంది. మొన్నటి డిసెంబరులో మొదటిదీ, యీఫిబ్రవరిలో రెండోదీ—అప్పుడే రెండు సంచికలు వచ్చాయి.

జనార్దనరావుగారు తమ సహజవిజ్ఞానానికి సాయంగా, మొన్నటిదాకా భారతి ఆఫీసులో నిర్వహణానుభవం గడించివున్నారు.

ఉదయిని ఉన్నతశ్రేణికి చెందిన పత్రిక. "చదువుకొన్నవారు" చదివే పత్రికగా సంపాదకులు దీన్ని నిర్దేశిస్తున్నారు. ఈప్రతిజ్ఞ నెరవేరుతుం దని సూచనలు కనపడుతున్నాయి.

రచనల విషయంలో మంచి శ్రద్ధ కనపడుతోంది.

కాని సంపాదకుల "కిరణాలు" చదువుకొన్నవారికేనా కొరుకుపడతాయా అని సందేహం.

ఉదయిని నవ్యాంధ్రసాహిత్యానికి మంచి పుష్టి కలిగిస్తుం దని ఆశిస్తున్నాము.

* సంవత్సరచందా ౪—౦—౦. విడిసంచిక వెల ౦—౧—౦. ఆఫీసు ౧౫ ఆదప్పమొదలివీధి, పేశరం, మదరాసు.



# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి * * * రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0-4-0 చందాదారులు ఒకేసారి రు 7-8-0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | |
|---|---|---|
| 11 | ప్రేమసుందరి | 1 8 0 |
| 12 | చోరశిఖామణి | 1 8 0 |
| 13 | లక్ష్మీప్రసాదము | 1 8 0 |
| 14 | హత్యారహస్యము | 1 8 0 |
| 15 | ఫాస్టు (1 భాగము) | 1 8 0 |
| 16 | ఫాస్టు (2 భాగము) | 1 8 0 |
| 17 | కుముద్వతి | 1 8 0 |
| 18 | చిన్నకోడలు | 1 8 0 |
| 19 | రహస్యభేదనము | 1 8 0 |
| 20 | సింహగడము | 1 8 0 |
| 21 | మణిహారము | 1 8 0 |
| 22 | మొగలాయీదర్బారు 1 భాగము | 1 8 0 |
| 23 | ఘటనాచక్రము | 1 8 0 |
| 24 | రాజసుందరి | 1 8 0 |
| 25 | కుంకుమభరణి | 1 8 0 |
| 26 | జాగిలము | 1 8 0 |
| 27 | మొగలాయీదర్బారు 2 వ భాగము | 1 8 0 |
| 28 | సరస్వతి | 1 8 0 |
| 29 | ఆనందాభాయి | 1 8 0 |
| 30 | హత్యాన్వేషణము | 1 8 0 |
| 31 | మొగలాయీదర్బారు 3 వ భాగము | 1 8 0 |
| 32 | గంగ | 1 8 0 |
| 33 | మొగలాయీదర్బారు 4 వ భాగము | 1 8 0 |
| 34 | కోహినూరు | 1 8 0 |
| 35 | ఆటీన్‌మణేలా | 1 8 0 |
| 36 | అపరిచిత | 1 8 0 |
| 37 | అంతఃపురము 1 భా॥ | 1 8 0 |
| 38 | అంతఃపురము 2 భా॥ | 1 8 0 |
| 39 | అగ్రహారము | 1 8 0 |
| 40 | ఛిన్నహస్తము 1 భా॥ | 1 8 0 |
| 41 | ఛిన్నహస్తము 2 భా॥ | 1 8 0 |
| 42 | కంకణరహస్యము | 1 8 0 |
| 43 | సంజీవి 1 భా॥ | 1 8 0 |
| 44 | సంజీవి 2 భా॥ | 1 8 0 |
| 45 | వజ్రరాణి | 1 8 0 |
| 46 | హత్యాభ్రమ | 1 8 0 |
| 47 | కాళఖండము | 1 8 0 |
| 48 | సేవాశ్రమము 1 భా॥ | 1 8 0 |
| 49 | సేవాశ్రమము 2 భా॥ | 1 8 0 |
| 50 | దాసీకన్య | 1 8 0 |

## అనుబంధములు

| | | |
|---|---|---|
| 1 | మృత్యురంగిణి | 0 12 0 |
| 2 | అభాగిని | 0 12 0 |
| 3 | ఛద్మవేషి | 0 12 0 |
| 4 | విదురుని యువదేశములు | 1 0 0 |
| 5 | కాంచనమాల | 1 0 0 |
| 6 | సీమంతిని | 1 0 0 |
| 7 | సుశీల | 1 0 0 |
| 8 | శశిరేఖ | 1 0 0 |
| 9 | యమునాబాయి | 1 0 0 |
| 10 | శ్యామల | 1 0 0 |
| 11 | కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 |
| 12 | కాలసర్పి | 1 0 0 |
| 13 | భారతకథాసారం | 1 0 0 |
| 14 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 |
| 15 | అరక్షణీయు | 1 0 0 |
| 16 | మాధవి | 1 0 0 |
| 17 | లలిత | 1 0 0 |
| 18 | పెండ్లిదండ | 1 0 0 |
| 19 | కథావళి | 1 0 0 |
| 20 | నాలుగుకథలు | 1 0 0 |
| 21 | నీతిప్రబోధిక | 1 0 0 |
| 22 | ఆదర్శము 1 భా॥ | 0 12 0 |
| 23 | ఉదంకుడు | 0 12 0 |
| 24 | భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | | |
|---|---|---|
| 1 | మార్కండేయ | 0 12 0 |
| 2 | అహల్యాశాపవిమోచనము | 0 12 0 |
| 3 | మేవారుపతనము | 1 0 0 |
| 4 | వరమాల | 1 0 0 |
| 5 | షాజహాను | 1 0 0 |
| 6 | నూర్జహాను | 1 0 0 |
| 7 | దుర్గాదాసు | 1 0 0 |
| 8 | చంద్రగుప్త | 1 0 0 |
| 9 | దంపతులు | 1 0 0 |
| 10 | విజయవిజయము | 1 0 0 |
| 11 | భక్తకుచేల | 1 0 0 |

 ఈగ్రంథములు రాజమండ్రీలో కళాభివర్ధనీ పరిషత్తులలోను దొరకును.

సరస్వతీ పాకెట్ డిక్షనరీ యొక్క ఒక నమూనా పుట :—

GARMENT 312 GATE

Garment—*n.* మనుష్యులలోని పైధరించువస్త్రము, బట్ట

Garner—*n.* ధాన్యము నిలువ పోయు కొట్టు ; *v. t.* నిలువ పోయు, కూడబెట్టు

Garnet—*n.* కెంపువంటిగాజు రాయి

Garnish—*v.t.* అలంకరించు; *n.* అలంకారము ; *also n.* Garnishment

Garret—*n.* మిద్దెగది

Garreteer—*n.* మిద్దెగదిలో వసించువాడు

Garrison—*n.* కోటలో నుండు రక్షణసేన ; *v. t.* రక్షణ సేననుంచు

Garrote (-tte)—*n.* పీకపిసికి చంపుపద్ధతి ; ఇట్టి పద్ధతితో గూడిన స్పెయినుదేశపుమరణ శిక్ష ; *v. t.* పీక పిసికి చంపు గొంతుక పిసికి దోచుకొను

Garrulous—*adj.* అధిక ప్రసంగియైన

Garter—*n.* మేజోడు దిగజారకుండ నుంచెడు నాడా ; *v. t.* ఇట్టి నాడాతో కట్టు

Gas—*n.* వాయువు; వట్టికబుర్లు డాబుమాటలు, గప్పాలు ; *v. t.* వాయువునుసమకూర్చు; విషవాయువును వదలిచంపు ;

*v. i.* వట్టికబుర్లు లేక డాబులు చెప్పు

Gaselier—*n.* పలుశాఖలు కొమ్మలుగలిగి వ్రేలాడునట్టి దీపము

Gaseous—*adj.* వాయురూపమైన నున్న

Gash—*v. t.* లోతుగ కోయు; *n.* లోతుగ తెగిన పొడవైన గాయము

Gas-light—*n.* వాయు సహాయమున వెలిగెడు కాంతిగల దీపము

Gasp—*v. i.* & *v. t.* ఊపిరి తీయుటకు నోరు తెరచు ; *n.* ఎగఊపిరి

Gasping—*adj.* ఎగరొప్పుచున్న ; *n.* ఎగఊపిరి

Gassy—*adj.* వాయుపూర్ణమైన ; వాయువువంటి

Gastric—*adj.* కడుపు సంబంధమైన ; Gastric juice జీర్ణద్రవము ; జఠరద్రవము

Gastrology—*n.* పాకశాస్త్రము, hence Gastrologist & Gastrologer *n.*

Gastronomy—*n.* రుచులెరింగించుశాస్త్రము ; తిండిపోతుతనము

Gate—*n.* బహిర్ద్వారము ;

సరస్వతీ ఇంగ్లీషు-తెనుగు పాకెట్టు డిక్షనరీ

గ్లేజు కాగితము—665 పేజీలు
సుమారు 17000
ఇంగ్లీషు పదములకు సులభమగు
తెలుగు అర్థములు—బాలబాలిక
లకు మిక్కిలి యుపయోగము.
చక్కని క్యాలికో బైండు.
వెల ప్రతి 1 కి రు 1-8-0

**Saraswathi English-Telugu**

**POCKET DICTIONARY.**

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి.

# వస్తుగుణ ప్రకాశిక

అచ్చులోనున్నది!

సరస్వతీ పవర్ ప్రెస్‌వారి ప్రచురణము, రాజమండ్రి.

మంచిగ్లేజుకాగితము ! సొగసైన క్యాలికోబైండు !! పుస్తకములో వస్తుగుణప్రబోధముగల పేజీలు 1000 పైగా నుండును. వెల ప్రతి 1 కి 5-0-0

ఇది సమస్తద్రవ్యగుణములను అసందిగ్ధముగ తెలియజేయు అపూర్వగ్రంథరాజము. ఆంధ్రవైద్యలోకమునకు, వైద్యేతరులకును మిక్కిలి యుపయోగకర మగునటుల బ్రహ్మశ్రీ ఆయుర్వేదభూషణ భిషగ్వర పండిత పిడూరి వాసుదేవ శాస్త్రి, ఏ. యం. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఇందు సందిగ్ధద్రవ్యములన్నియు నిర్ధారణచేయబడి ప్రచురింపబడినవి. నూతనపరిశోధితద్రవ్యములు చేర్చబడినవి. వస్తువునందలి రసవీర్యవిపాకప్రభావములను గుణములను విడదీసి వస్తుప్రాధాన్యము నిరూపింపబడినది.

**కటుకరోహిణి:**—కటుకా—Picrorrhiza kurroa Veronicalindleyana.

**పరిచయపదములు** శతపర్వా - చాలా గణుపులు గలది. కాండరుహా-కాడయే మొలచునది. చక్రాంగీ - ముక్కగొట్టిన చక్రాకారముగ నుండునది. గుణబోధినీపదములు: ఆమఘ్నీ - ఆమదోషమును బోగొట్టునది.

**స్వరూపము** ఇది గుల్మజాతిలోని మొక్క. ఆకులు కొంచెము పొడవుగను, కంగోరా గలిగి కుక్కపొగాకు ఆకులువలె నుండును. దీని పూవులు నీలిరంగు గలిగి గుత్తులుగా నుండును. దీనిలో రెండు జాతులు కలవు. నీలిరంగుగల దొకటియు, పచ్చరంగుగల దొకటియు. హిమాలయ ప్రాంత ప్రదేశములలో నిది విస్తారముగా నుండును. దీని వ్రేళ్లనే యౌషధములకు వాడుదురు.

**గుణములు** ఇది చేదురుచి గలిగి యుండును. వేడిచేయు స్వభావము గలది. విపాకమున కారపు రుచిగ మారును. రూక్షలఘుగుణములు కలది. బాగుగా విరేచనమును జేయును. అగ్నిదీప్తిని గలిగించును. హృదయమునకు హితకరమైనది. కఫపిత్తజ్వరములను హరించును. ప్రమేహములు శ్వాసకాసలు, రక్తతాపము, కుష్ఠరోగము, క్రిములు హరించును. విషమజ్వరములను పోగొట్టును.

**ప్రయోగములు** హృద్రోగమునకు:— కటుకరోహిణి, యష్టిమధుకమును మెత్తగా నూరి పంచదారనీళ్లతో కలిపి త్రాగిన హృద్రోగములు శమించును.

స్తన్యశుద్ధికి:—దీని వేళ్లు పాలతో గాని నీళ్లతో గాని నూరి త్రాగిన స్తన్యము శుద్ధమగును.

కఫపిత్తజ్వరములకు:—కటుకరోహిణి ఉసిరికాయంత ముద్ద వేడినీళ్లలో కలిపి కొంచెము పంచదార వేసి త్రాగిన క్రిములను బోగొట్టి విరేచనమును జేసి జ్వరములను తగ్గించును.

ఎక్కిళ్లకు:—గైరికమును, కటుకరోహిణియు సమానములుగ చూర్ణించి తేనెతో కలిపి యిచ్చిన ఎక్కిళ్లు శమించును. (సుశ్రుతము)

కటుకరోహిణి కషాయములో నవాసాకు చూర్ణము కలిపి మూడు రోజులు తెల్లవారుజామున నే త్రాగిన ఋతురక్తము జారీయగును. కటుకరోహిణి గుంటకలగరాకు రసముతో నొక వారము దినములు మర్దించి కందిగింజలంత మాత్రలు చేసి అల్లపురసముతో నిచ్చిన చలిజ్వరములు కట్టును. చిట్టినారమట్ట రసముతో కటుకరోహిణిని మెత్తగా నూరి గుండెలకు పట్టువేసిన గుండెలలో పీకునొప్పి తగ్గుటయే గాక, శ్లేష్మము కరగి ఆయాసము తగ్గును. లోని కిచ్చు మోతాదు ఎక్కువైనచో వికారమును గలిగించును. కటుకరోహిణిలో రెండవరకముగు తెల్లది నల్లదానికంటె తీక్ష్ణమైన గుణములను గలిగి మిక్కిలి విరేచనమును జేయు స్వభావము గలిగి యుండును. వాడుకలో నల్లదానికంటె తెల్లది తక్కువ మోతాదుగనె వాడవలయును. లేక వికారము వాంతియును గలిగించును దీనిని పైన పట్టువేసినచో పొక్కును. దీనికి బాదమునూనె గాని వప్పుగాని విరుగుడువస్తువ.

**నవీన వైద్యక మతము** ఇది రసాయనము. చేదురుచి, పాచనకారి, పైత్యహరము. అజీర్ణము, గ్రహణి, శ్వాస, పిత్తవికృతులు, కామల మొదలగు రోగములయందు దీనిని బాగుగా వాడవచ్చును. యకృద్వృద్ధిలో నిది చేదుపుచ్చతో సమానముగా పనిచేయును. చేదుపుచ్చకంటె ఇది మృదువుగా పనిచేయును. విషమజ్వరముల కిది యుత్తమమైన యౌషధి. పిల్లల క్రిమిరోగములయందు కటుకరోహిణి బాగుగా పనిచేయును. (మెటీరియా మెడికా ఆఫ్ ఇండియా. R. N. Khory part II, P. 457.)

# అమృతాంజనము



అన్ని నొప్పులను

బాధలను కుదుర్చునని

<u>తమకు తెలియును</u>

<u>అయిన తెలియవలశిన దేది !</u>

నేడు దేశమంతటను కుక్కగొడుగుల వలె తలలెత్తిన నకలు మందుల చూచి మోసపోకుండుటయే !




బజారులలో కొనుటకు పూర్వము మా ట్రేడు మార్కు గుర్తులన్నిటిని జాగ్రత్తగా పరిశీలించుడు.

# ప్రబుద్ధాంధ్ర






విడి సంచిక రెండణాలు ౬ ౫ సంపాదకుడు

౧౦ మే ౧౯౩౯

సంవత్సర చందా రూపాయి రాజమండ్రి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# విరాళములు

ఈనెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు.

౧ పింగళి వేంకటరామారెడ్డి దేశముఖుగారు—
హైదరాబాదు. ౧౫—౦—౦

౨ డాక్టరు జే. సి. కామేశ్వరరావుపంతులుగారు—
లెక్చరర్ నైజాం కాలేజీ హైదరాబాదు. ౧౦—౦—౦

౩ పింగళి కోదండరామారెడ్డి దేశముఖుగారు—
హైదరాబాదు. ౧౦—౦—౦

౪ డాక్టరు పి. వి. రమణయ్యగారు—హైదరాబాదు. ౫—౦—౦

౫ కొండా వెంకటరంగారెడ్డిగారు—హైకోర్టు వకీలు
హైదరాబాదు. ౫—౦—౦

౬ వైద్యవిద్వాన్. విద్వాన్ చిట్టి నారాయణమూర్తి
పంతులుగారు—ప్రొప్రయిటరు కృష్ణాయుర్వేద
ఫార్మసీ. తెనుకు ౫—౦—౦

# వైశాఖి

ఇది కవితా సమితివారి వార్షికసంచిక. పేరువడ్డ విద్వత్కవుల రచనలతోటీ, చక్కని చిత్రాలతోటీ, రూప పటాలతోటీ ముద్దుగావుంది. అంటెక్కు కాగితం. చక్కని బయిండు. వాఙ్మయోద్యానంలో, రసికులు ప్రత్యేకాదరంతో నిలిచి చూడవలసిన పుష్పం యిది.

వెల ౧—౦—౦ పోష్టు ఖర్చులు పైగా.

కలాభివర్ధనీ పరిషత్తు—రాజమండ్రి

# కృతజ్ఞులము

ఈ సంచిక ముఖపత్రం మీది చిత్రమును రాసి ప్రబుద్ధాంధ్రకు కళ కూర్చిన శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారికి మేము ఎప్పుడూ కృతజ్ఞులము.

సంపాదకుడు

# ఆంధ్ర ప్రముఖుల ఫొటోలు

రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తిపంతులు గారిదీ, వెలగపూడి రామకృష్ణ చౌదరిగారిదీ శ్రీ రాజా (కొత్వాలు) వెంకటరామారెడ్డి బహద్దరుగారిదీ ఫొటోలు మావద్ద అమ్మకాని కున్నవి. డజను ౧—౮—౦ వీ. పీలో తక్కువ పంపము. పోష్టు ఖర్చులు ౦—౬—౦.

కలాభివర్ధనీ పరిషత్తు—రాజమండ్రి

# విషయసూచిక


౧ ఏక్షిడా అంగరంద లేదు—సంపాదకుడు ౧౪౧

౨ నటుడి బాధ్యతలు—కొడవటిగంటి కుటుంబరావు
ఎం. ఏ గారు ౧౫౩

౩ హైమ—మల్లాది అవధానిగారు ౧౫౫

౪ విశ్వజనీనత—కొమాండూరి శఠకోపాచార్యులుగారు
ఎం. ఏ. బి. ఎల్. ౧౫౯

౫ అప్పకవీయంలోని అలంకారవిషయం—ఉభయ
భాషాసాహిత్య విద్యాప్రవీణ బులుసు వేంకటరమ
ణయ్యగారు ౧౬౧

౬ శ్రీ రాజా, వెంకటరామారెడ్డి బహద్దరుగారు ఓ. బి. ఇ.
సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ. బి. ఎల్. ౧౬౩

౭ హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం—
(సంపాదకుడు, రాష్ట్రభాషావిశారద. మల్లాది నరసిం
హాసోమయాజులుగారు, మహీధర రామమోహన్
రాయ్ గారు, (ప్రభాతము) ౧౬౬—౧౬౮

౮ వ్యాఖ్యానములు—(౧ పండితపూజ. ౨ మహాఘనత
వహించిన త్యాగి. ౩ పానుగంటికవి. ౪ ఇలా
అన్నారా లేదా గాంధిగారు. ౫ ఆంధ్రరాష్ట్రం
కావా లంటే వొకటే మార్గం, ౬ గాంధిగారూ
హిందీ ప్రచారమూనూ. ౭ మాటలు నేర్పవి అవే,
౮ నాట్యకళ. ౧౬౯—౧౭౬


# చరకసంహిత

చికిత్సాస్థానము మాచే ఇదివరకు ఆంధ్రీకరింపబడి యిపుడు ద్వితీయ ముద్రణమునకున్నది. మిగిలిన ఆరు స్థానములను ఆంధ్రీకరించి, స్థానషట్కమనే పేరుతో ఒక పుస్తకరూపమున ప్రచురించితిమి. గ్రంథములన్నియు కొలదిదినముల క్రిందటనే తయారైనవి. వెంటనే ఆర్డరిచ్చు వారికి తగినసౌకర్యముగా లభింపగలవు. చరకసంహిత నంతను నేనే పూర్తిగా ఆంధ్రీకరింపదలచి మిగిలిన సూత్రస్థానమునుగూడ ఆంధ్రీకరించి కొద్దిరోజులలో ప్రచురింపబోవుచున్నాడను. గ్రంథము పూర్తికాకుండ ఆర్డరిచ్చువారికి తగుసౌకర్యములతో లభింపగలదని అందరికీ తెలిసిన విషయమే. మా యితరపుస్తకములును మా 250 రకముల మందులును ఎల్లప్పుడును సిద్ధముగ నుండును.

డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, బెజవాడ.

# వసంతకుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచపుండ్లు, శుక్రక్షయము, శుక్రనష్టము, బలహీనత, చిరకాలపు తెల్లకుసుమ, సుఖవ్యాధులు శీర్ణించుటచే కలుగు సకలమూత్రవారివ్యాధులకు ప్రసిద్ధికెక్కిన రాజౌషధము. తులము. రు 20—0—0.

# సిద్ధమకరధ్వజము

ఇందు బంగారు కలదు. పూచీ యిచ్చెదము.

జగత్ప్రసిద్ధమగు బలవర్ధకౌషధము. రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము. క్షయ, శ్వాసకాసలు, నరముల బలహీనత, కుసుమ రోగములు, మొదలగువానికి దివ్యౌషధము.

తులము 24—0—0. 60 మాత్రలు రు 10—0—0

# ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీ విలాసరసము

# చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు దివ్యౌషధములు

చిరకాలము క్షయవ్యాధిచే పీడింపబడుచు శల్యావశిష్టముగ నుండువారలకు నూతనయౌవనమును ఆరోగ్యమును కలిగించును. క్షయ శ్వాసకాసలు ఉబ్బసము కఫముతో కలసి రక్తముపడుట, రక్తహీనత, శరీరకృశత్వము, హృదయదౌర్బల్యము దీర్ఘకాలము నుండి బాధించు మొండిదగ్గులు మొదలగునవి జయించును. బలము, కాంతి శుక్రమును వృద్ధిచేయును.

రెండుఔషధములు కలిపిసేవించవలెను.

నెలకు రు 13—12—0.

# స్వర్ణక్రవ్యాదరసము

చిరకాలాజీర్ణములకు మంచిది. కడుపుబ్బరము, శూల, గుల్మము, యకృత్ ప్లీహ వృద్ధులు మొదలగునవి జయించును. బలవర్ధకము తులం రు 4—0—0.

చిరునామా:—వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము

హెడ్డాఫీసు:—చింతలూరు, ఆలమూరుపోష్టు, తూర్పుగోదావరిజిల్లా

---

బ్రాంచీలు:—1. కాకినాడ, 2. రాజమండ్రి, 3. పెద్దాపురం, 4. అనకాపల్లి, 5. విశాఖపట్టణం, 6. ఏలూరు, 7. అమలాపురం, 8. తుని, 9. రామచంద్రపురం.

☞ ఏలూరు బ్రాంచిలో చికిత్సకులు

వైద్యవిద్వాన్ కూచిభొట్ల వెంకటేశ్వర్లుగారు.

# పోస్టేజి లేదు

## శ్రీయుత అయినాపురపు సుందరరామయ్యగారి

### నాటకములు

1\. లాలుగోహరు 0_7_0. 2. గులేబకావలి 0_10_0. 3. పసందు బకావలి 0_8_0. 4. బంగన్ బకావలి 0_10_0. 5. ప్రతిజ్ఞాపాండవము 0_8_0. 6. ప్రతిజ్ఞాయాదవము 0_8_0. 7. వాసంతిక 0_7_0. 8. ముద్రాశ్రీ 0_10-0. 9. శ్రీకృష్ణవిలాసము 0_8_0. 10. గర్వభంగము 0_6_0. 11. ప్రేమజాబులు 0_8_0.

### నవలలు

1\. హంసయాన 0-1_0. 2. పద్మిని 0_1_0. 3. వీరాబాయి 0_1_0. 4. కృష్ణకుమారి 0_1-0. 5. ధనార్జన 0_1_6. 6. ఎడమకాలి తన్ను కుడిచెంపముద్దు 0_1_6. 7. ఈతఁడు నామగఁడు అతఁడు నాకూతురు మగఁడు 0-1_0. 8. సుందరసునీతి 0_1_6. 9. పుష్కర మహాత్మ్యము 0_1-0.

☞ నోటు:—పైనాటకములలో నేదికావలసినను దాని వెలకు తగిన పోష్టేజిస్టాంపులు పంపువారికి ఆపుస్తకము అన్ రిజిష్టరు పార్శిలుగా నందజేయుదుము. మూఁడు నాటకములకు తక్కువకాకుండా ఒకేసారి కొనువారికి పోష్టేజి మేము భరించి వి. పి. గా పంపెదము. నవలలు తొమ్మిది కావలసినవారు రు 0_13_0 అణాలు పోష్టుబిళ్లలు పంపిన చాలును.

వేంకటరమణ అండు కో, రాజమండ్రి.

---

# గర్భచింతామృతము

ఆవునేతితోగాని చన్నీటితోగాని ఉదయము సాయంత్రము భోజనముచేసిన వెంటనే తు ½ లము చొ॥న వంధ్యలగు స్త్రీలు సేవించిన సంతానము కలిగి జీవించును. సంతానము మృతిపొందు స్త్రీలు సేవించిన దీర్ఘాయుష్మంతుడగు సంతానము గలుగును. గర్భిణీస్త్రీలుగాని గర్భము ధరించని స్త్రీలుగాని సేవించిన సమస్త మేవములు, జ్వరములు, పాండురోగములు, ఉన్మాదము గుండెదడ, నరముల నిస్సత్తువ, మొదలైన సమస్తరో ములు తగ్గి మిక్కిలి బలము కలిగి ఆయుర్వృద్ధి నిచ్చున

వెల పౌను రు. 3—0—0.

వైద్యశాస్త్రి, డా॥ చిట్టి సూర్యనారాయణమూ

భీమవరం, ప. గోదావరిజిల్లా.

# ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

రూ. అ.

**నాళం కృష్ణారావుగారివి**

| | | |
|---|---|---|
| లేతచిగుళ్లు | ౦ | ౮ |
| పాలతరగలు | ౦ | ౮ |
| గోగీతము | ౦ | ౨ |
| పైడిలేడి | ౦ | ౨ |
| ముద్దు | ౦ | ౪ |

**పూజాపుష్పమాలవారివి**

| | | |
|---|---|---|
| చాకిరేవు | ౦ | ౮ |
| బాష్పబిందువు | ౦ | ౮ |

**రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారివి**

| | | |
|---|---|---|
| వ్యాససంగ్రహం | ౩ | ౮ |
| గద్యచింతామణి | ౧ | ౮ |
| బాలకవిశరణ్యము | ౧ | ౮ |
| వ్యాసావళి | ౧ | ౦ |
| ఆంధ్రకవిభిషక్కుల భాషాభేషజము | ౧ | ౦ |

**వ్యాసకుటీరంవారివి**

| | | |
|---|---|---|
| జన్మభూమి నాటిక | ౦ | ౪ |
| ప్రేమాంజలి—పంచమదంపతులచరిత్రం | | ౫ |
| శుభోదయము | ౦ | ౩ |
| శ్రీ వివేకానంద సందేశము | ౦ | ౨ |
| సుగుణాకరము | ౦ | ౧౪ |
| తూలిక | ౦ | ౧౦ |
| ఆత్మజ్యోతి | ౦ | ౮ |
| సంధ్య | ౦ | ౬ |

**ఉన్నవ లక్ష్మీనారాయణగారివి**

| | | |
|---|---|---|
| నాయకురాలు | ౧ | ౦ |
| సంగీతనాపసాని | ౦ | ౧ |
| సోది | ౦ | ౧ |
| భావతరంగాలు | ౦ | ౧ |
| హరిజన నాటకము | ౦ | ౧ |

**వఝల వేంకటేశ్వరకవిగారివి**

| | | |
|---|---|---|
| నాకాభంగము | ౦ | ౧౨ |

**గోల్కొండ పత్రికవారివి**

| | | |
|---|---|---|
| గోల్కొండకవుల సంచిక | ౨ | ౦ |
| తుచ్ఛుల విషాదము | ౦ | ౧౨ |
| రెడ్డికులనిర్ణయచంద్రిక | ౧ | ౪ |
| సంఘోద్ధరణము | ౦ | ౬ |
| కర్నూలు రాజవంశావళి | ౦ | ౨ |
| రఘునాథ్ | ౦ | ౧౬ |

**మారేమండ రామారావుగారివి**

| | | |
|---|---|---|
| భారతీయ విద్యాచరిత్రము | ౦ | ౧౨ |
| శ్రీమధ్వాచార్యులవారి చరిత్ర | ౧ | ౦ |

**భావరాజు వేంకటకృష్ణారావుగారివి**

| | | |
|---|---|---|
| విదేశయాత్రికులు_ప్రాచీనాంధ్ర దేశము | ౧ | ౪ |

**కవితాసమితివారివి**

| | | |
|---|---|---|
| వైశాఖి—వార్షిక సంచిక | ౧ | ౦ |
| ఉత్కళపతనము నాటకం | ౦ | ౧౨ |
| ప్రథమ—ఖండకావ్యాలు | ౦ | ౮ |
| మాతృపూజ పద్యఖండాలు | ౦ | ౪ |

**స్థానాపతి రుక్మిణమ్మగారివి**

| | | |
|---|---|---|
| పూలమాల—ఖండకావ్యాలు | ౦ | ౪ |

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| వ్యాసావళి | ౦ | ౪ |

**కూచి నరసింహంగారివి**

| | | |
|---|---|---|
| ఆత్మసంయమము_అమితవిషయాసక్తి | ౦ | ౬ |
| అనుబంధము | ౦ | ౩ |

**వేటుమల్ల కామేశ్వరరావుగారివి**

| | | |
|---|---|---|
| కలువలు | ౦ | ౪ |
| పాతపాటలు | ౦ | ౨ |

**మునిమాణిక్యం నరసింహారావుగారివి**

| | | |
|---|---|---|
| కాంతం కథలు | ౧ | ౦ |
| నేనూ మా కాంతం | ౦ | ౪ |
| వక్రరేఖ | ౧ | ౦ |

**రెం. లక్ష్మీనరశింహశాస్త్రి గారివి**

| | | |
|---|---|---|
| హృదయవిహంగము | ౦ | ౪ |

**నడింపల్లి జగన్నాథరావుగారివి**

| | | |
|---|---|---|
| ఆంధ్రమహాసామ్రాజ్యము (సాదా) | ౧ | ౪ |
| క్యాలికో ఉత్తమప్రతి | ౨ | ౮ |
| Age of Mahabhrata | 1 | 0 |

**చెలికాని సత్యనారాయణగారివి**

| | | |
|---|---|---|
| జడగంటలు | ౦ | ౮ |
| రహస్యలేఖ | ౦ | ౮ |
| చక్రపాణి | ౦ | ౮ |

**మొసలింటి సంజీవరావుగారివి**

| | | |
|---|---|---|
| బక్సారుయుద్ధము చరిత్ర | ౦ | ౧౨ |
| ఔరంగజేబు పాదుషా | ౦ | ౧౨ |
| సిందుబాదుకథలు | ౦ | ౫ |

**నడింపల్లి వేంకటహనుమంతరావుగారివి**

| | | |
|---|---|---|
| సాహసిక—నవల | ౧ | ౦ |

**గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివి**

| | | |
|---|---|---|
| ప్రచ్ఛన్న పాండవము (నాటకం) | ౦ | ౮ |
| వోటు | ౦ | ౧౦ |
| మూర్ఖరాజు | ౦ | ౪ |
| నీతిధర్మము | ౦ | ౪ |
| సంపూర్ణస్వరాజ్యము | ౦ | ౪ |
| శ్రీరామచరిత్ర | ౦ | ౮ |
| ప్రపంచచరిత్ర (గ్రీసు) | | |
| మొదటి భాగము | ౦ | ౮ |
| రెండవ భాగము | ౦ | ౮ |
| మూడవ భాగము | ౦ | ౮ |
| నాలుగవ భాగము | హాజరులేదు | |
| అయిదవ భాగము | ౦ | ౮ |
| ఆరవ భాగము | ౦ | ౮ |
| ఏడవ భాగము | ౦ | ౮ |
| Neglected Emporor poet | 0 | 8 |
| Spiritual Swadesi | 1 | 0 |
| Age of Vemana | 0 | 6 |

**పార్నంది రామశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| శ్రీ మహాభారత విమర్శ | ౦ | ౮ |

**రాయసం శేషగిరిరావుగారివి**

| | | |
|---|---|---|
| కొత్తనమూనా (నాటకం) | ౦ | ౧౨ |

**మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| చతుర్దశమనుచరిత్ర | ౦ | ౮ |
| సుభాషితములు | ౦ | ౧ |

**కో. స్వర్ణవల్లిగారివి**

| | | |
|---|---|---|
| వినోదశిల్పము | ౧ | ౪ |

**సహదేవ సూర్యప్రకాశరావుగారివి**

| | | |
|---|---|---|
| మునిమాపు | ౦ | ౧౨ |
| వకుళమాల | ౦ | ౧౨ |

**ఆంధ్రరత్నగ్రంథమాలవారివి**

| | | |
|---|---|---|
| సుందరి | ౧ | ౦ |

**సాహితీ సమితివారివి**

| | | |
|---|---|---|
| సఖి. మొదటిసంపుటం. నాలుగు సంచికలు. కాలికోబయిండు | ౩ | ౧౨ |

కలాభివర్ధనీపరిషత్తు—ఇన్నిస్‌పేట—రాజమండ్రి